## విజ్ఞప్తి

చందాదారులుగా చేరండి! రెన్యూల్ చేయవలసిన వారు వెంటనే తమ చందాను పంపి శ్రీవాణి సాంస్కృతిక మాస పత్రికను ప్రోత్సహించండి! సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన ప్రచారానికి చేయూత నివ్వండి!

| | |
|---|---|
| సంవత్సర చందా | రు 33-00 |
| 2 సం చందా | రు 60 00 |
| 4 సం. చందా | రు 116-00 |
| జీవిత సభ్యత్వం | రు 500-00 |

ఫోటోలు శ్రీవాణిలో ముద్రించబడును.

సహకారం అందించ ప్రార్థన.

24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం : 521 001

కొమరగిరి చంద్రశేఖర్
మేనేజర్

## కమెండేషన్ నెంబరు

ఆంధ్ర ప్రదేశ్‌లోని సమస్త ఉన్నత పాఠశాలల గ్రంథాలయముల వారు 'శ్రీవాణి' పత్రికనుకొనుగోలుచేయవచ్చునని పాఠశాలల విద్యా సంచాలకుల ( Director of School Education ) వారు ఉత్తర్వులు ( నిర్దేశిక సంఖ్య 62/ యస్ 4/85 తేది. 3 - 6 - 86 ) జారీ చేసినారు. కనుక ప్రతి ఉన్నత పాఠశాలవారు 'శ్రీవాణి'ని తెప్పించుకుంటారని ఆశిస్తున్నాను - ( సం )

## నీతి మంజరి

శ్లో : సత్యం మాతా పితా జ్ఞానం
ధర్మో భ్రాతా దయా సఖా
శాంతిః పత్నీ క్షమా పుత్రః
షడైతే మమ బాంధవాః

ప : సత్యము జనయిత్రి, జ్ఞానమ్ము జనకుండు
ధర్మము సయిదోడు, దయ సఖుండు
శాంతి ధర్మపత్ని - క్షమ కుమారుడు, వీర
లాత్మ బంధువులనె యమసుతుండు

శ్లో : అర్థాతురాణాం న గురుర్న బంధుః
కామాతురాణాం న భయం న లజ్జా
విద్యాతురాణాం న సుఖం న నిద్రా
క్షుధాతురాణాం న రుచిర్న పక్వమ్

ప : ద్రవ్యకామికి గురువు బాంధవులు లేరు
కామ మతికి వెఱపు, లజ్జ కానరావు
సుంతకనరాడు విద్యార్థి సుఖము, నిద్ర
ఆకలిగొనువాడు రుచుల నరయఁ బోడు

శ్లో : ఔదుంబరాణి పుష్పాణి
శ్వేత వర్ణంచ వాయసమ్
మత్స్యపాదం జలేపశ్యేత్
న నారీ హృదయ స్థితమ్.

ప : మేడిపువ్వునైన చూడవచ్చు, శ్వేత
వాయసమ్మునేని బట్టవచ్చు
నీటిలోని చేప బాట గుర్తిడవచ్చు
స్త్రీల మనసు సుంత తెలియ లేము.

- పృథివి సుబ్బనాగయ్యకవి

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు

సెప్టెంబరు - 1986

సంపుటి : 2

సంచిక : 9



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818


చందా వివరాలు

విడిప్రతి : రు. 3-00

సంవత్సర చందా : రు. 33-00

2 సం॥ల చందా : రు. 60-00

4 సం॥ల చందా : రు. 116-00

జీవిత సభ్యత్వం : రు. 500-00


EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS

MACHILIPATNAM


## విషయసూచిక



ముఖచిత్రం :

డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్

శ్లో॥ నిద్రాం సాత్త్వికవస్తుసేవకతయా, స్వప్నం సదా జాగరాత్,
రోగాన్ జీర్ణమితాశనా జ్జహి, సదా దైన్యం మహాధైర్యతః,
అర్థానర్థ పరిగ్రహం త్యజ, వృథా సంసర్గ సంత్యాగతః,
స్త్రీవాంఛాం త్యజ దోషదర్శన బలాత్, దుఃఖం సుఖాత్మేక్షణాత్ ॥

# అమృతవాణి

ఖాచిభట్ల చంద్రశేఖరశర్మ

నిద్ర అంటే మందకొడిగా జడస్వభావంతో పడివుండటం. స్వప్నమంటే యెప్పుడూ అతి నిద్రలో మునిగి వుండటం. మానవుడు ఈ రెంటిని వదిలించుకోకపోతే మానవజన్మ ఫలితాన్ని అందుకోలేడు. ఇవి రెండూ తమోగుణ లక్షణాలు. మందకొడితనం పోవాలంటే తప్పకుండా సాత్త్వికాహారం తీసుకోవాలి. సాత్త్వికాహారం తీసుకోటంవల్ల ఆయురారోగ్యాదులు కూడా వృద్ధి చెందుతాయని గీత కూడా చెప్పింది. అలాగే స్వప్నావస్థను దూరంగా వుంచాలంటే జాగరణం చేస్తూంటే సరిపోతుంది. సత్త్వగుణం కలిగించే పదార్థాలను భుజించటం వల్ల జ్ఞానం కలుగుతుందని ప్రధానంగా తెలుసుకోవాలి. జ్ఞానం కలిగితేకాని జడత్వం నశించదు.

అలాగే శరీరానికి రోగాలు రావటం సహజమే. అయినా ఆ రోగాలకు మూలకారణమైన అజీర్ణాన్ని దగ్గరకు రానీకూడదు. అజీర్ణం ఏర్పడితే చాలు అన్నిరోగాలూ తయారవుతాయి. అందువల్ల తేలికగా జీర్ణమయ్యే ఆహారాన్ని హితంగా మితంగా తీసుకోటం మంచిది. దానివల్ల రోగాలు దూరమౌతాయి. మొదట చెప్పిన ఆ సాత్త్వికాహారం తీసుకుంటే అజీర్ణంరాదు. ఆ సాత్త్విక పదార్థాలు కూడా మితంగా హితంగా పుచ్చుకుంటే సరి. ఇలాగే దీనంగా జీవితం గడుపుతూంటారు కొందరు. ఆ దైన్యం కూడా దోషమే. దైన్యాన్ని పోగొట్టాలంటే దానికి కావలసిందల్లా మంచి ధైర్యం. దైన్యం శరీరాన్నికూడా కృశింపజేస్తుంది. అటు జ్ఞాన సంపాదనకు ఆటంకమవుతుంది. ఏమీ పరవా లేదు. సుఖం దుఃఖం రెండూ ఒకటే అనే నిర్లిప్తభావం కలిగివుంటే మనో ధైర్యం కావలిసినంత యేర్పడుతుంది. మన కర్తవ్యం మన ధర్మం అని సమతాభావాన్ని అలవరుచుకోటమే ధైర్యం. ఈ ధైర్యంవస్తే పొంగటం క్రుంగటం ఏమీ వుండదు.

లౌకిక వ్యాపారంలో కొన్ని పనులు ప్రయోజనం కలిగిస్తాయి కొన్ని నిష్ప్రయోజనాలవుతాయి. ఈ పనులు సాధించుకోటానికి నీచాశ్రయం చేయవలసి వస్తుంది. అసలు అయినవాడిని కానివాడిని ఆశ్రయించి వాడితో సాంగత్యం పెట్టుకోవటమే మానేస్తే అసలు ఈ లాభాలాభ దృష్టే కలగదు. అందుచేత వ్యర్థమైన స్నేహాలు సాంగత్యాలు పెట్టుకోకూడదు.

వీటన్నింటి లాగానే స్త్రీ వాంఛ అతి నీచమైనది. దీని వల్ల మానవత్వమే నశిస్తుంది. ఇది కామం వల్లకలిగే దుర్వారమైన కోరిక. జ్ఞానానికి పూర్తి ప్రతిబంధకం. ఇందులో సుఖమున్నట్లు కనబడుతుందే తప్ప మరేంలేదు. ఈ మాత్రానికే వశుడైన మనిషి జనన మరణాత్మకమైన సంసార లంపటంలో పడతాడు దీన్ని మనసు నుంచి దూరం చేయాలంటే దానిలోని దోషాలను మాటి మాటికి స్మరించాలి. అది సంసార హేతువు సంసారం మోక్షానికి ప్రతిబంధకం — అని తెలుసుకోవాలి. నిజమాలోచిస్తే స్త్రీ గతమైన శరీరమంతా మల మూత్ర రక్త మాంసాస్థిపూర్ణమైనదే కదా! అనే భావన బాగా చేస్తే స్త్రీ వాంఛ తొలగిపోతుంది.

నాకు దుఃఖం వద్దు సుఖమే కావాలి అని మనిషి కోరుకుంటాడు కదా! అసలు సుఖమేదో వీడికి తెలియదు. ఆత్మదర్శనమే నిజమైన శాశ్వత సుఖం. ఆత్మ సర్వదా ఆనంద స్వరూపమే. అలాంటి ఆత్మను తెలుసుకుంటే అసలు దుఃఖమనేదే వుండదు.

ఈ విధంగా నిద్రాది దోషాలను పోగొట్టుకోటానికి అంటే యీదుర్వాసనలు తొలగించుకోటానికి సాత్త్విక వస్తు సేవనాద్యుపాయాలను శంకరులు ప్రబోధించారు. ●

# అందరికీ నమస్కరించి.....

భగవాన్ శ్రీ సత్యసాయి బాబాగారి పవిత్రమైన ఆశీస్సులతో, పాఠకులు, రచయితలు, ప్రకటనదారుల సహకారంతో 'శ్రీవాణి' ని సకాలంలో క్రమం తప్పకుండా పాఠకులకు ( 21 సంచికలు ) అందించగలిగాను. శ్రీవాణి పాఠకులతో ముచ్చటించక చాలా కాలామైంది. శ్రీవాణికి వస్తున్న ప్రశంసల గురించి, యిబ్బందులను గురించి శ్రీవాణి కుటుంబ సభ్యులతో ప్రస్తావించడం ఉచితమని భావించి ఈ లేఖ ప్రత్యేకంగా వ్రాస్తున్నాను.

శ్రీ సాయిబాబాగారి కరుణాకటాక్ష వీక్షణములకు పాత్రుడనైనందుకు ఎందరో పాఠకులు నన్ను అభినందిస్తూ లేఖలు వ్రాశారు. అనేకమంది మిత్రులు ప్రత్యేకంగా సుదూర ప్రాంతముల నుండి వచ్చి ఆనందంతో మనసు విప్పి మాట్లాడారు. వారలకు నా కృతజ్ఞతలు. శ్రీ బాబాగారి అనుగ్రహం పొందిన తరువాత నా బాధ్యత యింకా పెరిగిందని భావిస్తున్నాను. అటువంటి దివ్య పురుషుల అనుగ్రహం లభించడం, నిజంగా అది నా పూర్వ జన్మ సుకృతమే. శ్రీ బాబాగారు మానవ రూపం దాల్చిన సాక్షాత్ భగవంతుడే అనడంలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు. అందువలన నేను యింకా జాగ్రత్తగా పత్రికస్థాయిని ఏ మాత్రం తగ్గించకుండా, ఉన్నతస్థాయిలో నడుపవలసిన బాధ్యత నామీద పడింది. ఆ గురుతర బాధ్యతను శక్తివంచన లేకుండా నిర్వర్తిస్తానని పాఠకులకు హామీ ఇస్తున్నాను.

అయితే ఈ రోజులలో శ్రీవాణి లాంటి ఉత్తమ ఆశయ, ఆదర్శములు గల పత్రికను నడపడం బహు కష్టం. శ్రీవాణి ప్రారంభంలో ఉన్న న్యూస్‌ప్రింటు ధరకన్నా నేడు రీముకు రు 35/- లు పెరిగింది. ప్రింటింగు రేట్లు పెరిగాయి అయినప్పటికీ ప్రతి నెలా సకాలంలో పత్రికను అంపిస్తున్నాను. సంవత్సరాంతం కావడం వలన యిబ్బందులు సహజంగా ఎదురవుతాయి. వీటిని తట్టుకోవాలి గదా !

పాఠకులు సహృదయంతో నా ఆవేదనను అర్థం చేసుకుంటారని ఆశిస్తున్నాను. 9 నెలలు పూర్తి అయినా కొంతమంది యింకా తమ చందాలను "రెన్యూవల్" చేయలేదు. ఎప్పుడో ఒకప్పుడు ఏదోరకమైన సహకారం పత్రికకు అందిస్తారనే సదుద్దేశ్యంతో ముందుకు నడుస్తున్నాను. ఈ పత్రికమీద సంపాదించాలనే కోరిక లేదు. డబ్బే సంపాదించాలనుకుంటే నడిపే విధానం మరొక రకంగా ఉంటుంది. అటువంటి వక్రమార్గాల ననుసరించ దలచలేదు. లాభం రాకపోయినా ఫరవాలేదు. నష్టం వస్తే తట్టుకొనే స్తోమతమాత్రం నాకు లేదు.

మన రాష్ట్ర పరిధులను దాటి శ్రీవాణి ఇతర రాష్ట్రములలో 102 కేంద్రములను చేరుకోగలిగింది. ఇది చాలదు. ఇంకా ఎంతో కృషి జరగాలి. శ్రీవాణిని సమగ్ర విజ్ఞాన వాణిగా యింకా తీర్చి దిద్దాలి. ఈ మహా ప్రయత్నానికి యావన్మంది సహకారం అత్యవసరం. రెన్యూవల్ చేయవలసినవారు చేస్తూ, చందాలు పంపవలసినవారు పంపిస్తూ, ప్రతివారూ కనీసం ఒక మిత్రునిచేత క్రొత్త చందాను కట్టించి శ్రీవాణిని ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాను. ఆర్థిక స్తోమత గలవారు జీవిత సభ్యులు ( రు 500.00 ) గా చేరి శ్రీవాణికి ఆర్థికస్తోమత కలుగ జేస్తారని ; వ్యాపారస్తులు, పారిశ్రామిక వేత్తలు తమ ప్రకటనల (ADVERTISEMENTS) ద్వారా సహకారం అందించి "సాహిత్య, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా, విజ్ఞాన ప్రచారము" నకు తోడ్పడుతారని విశ్వసిస్తున్నాను.

ఈ మహా ప్రయత్నానికి ఎవరి పరిధిలో వారు సహకారమును అందించమని ప్రేమతో అడుగుతున్నాను, ఆప్యాయతతో అర్థిస్తున్నాను.

ధన్యవాదములు.

కొమురగిరి కృష్ణమోహనరావు



# విఘ్నములు నివారించు విఘ్నేశ్వరుడు

శ్లో॥ అగజానన పద్మార్కం
గజానన మహర్నిశమ్
అనేక దన్తం భక్తానాం
ఏకదన్త ముపాస్మహే.

అనగా హిమవత్పర్వతముయొక్క పుత్రిక యగు పార్వతీదేవియొక్క పద్మమువంటి ముఖమునకు సూర్యుని వలె (సంతోషమును కలిగించువాడును) భక్తులకు అనేక వరములను యిచ్చువాడును ఐగు ఆ వినాయకుని పగలు రాత్రియును (ఎల్లప్పుడునూ) సేవింతును.

పండుగలకును పర్వములకును ప్రకృతితో నిత్య సంబంధం కలదు. పకృతి విలాసమే దీని ఉత్పత్తికి మూలకారణం. జీవకోటిజీవయాత్రకు ఆధారం ప్రకృతియే. ప్రకృతి కామధేనువు. పండుగలు మన సంస్కృతిని ప్రతిబింబిస్తూ ఉంటాయి. ఆ సందేశాలలోని స్ఫూర్తిని గైకొని ఉత్తేజులమై మనం ముందుకు సాగిపోతుంటాం. ప్రతి పండుగ వెనుక ఒక గాథ ఉంటుంది. ఆగాథ మనకు స్ఫూర్తిని యిస్తూవుంటుంది, అంతేకాదు మన సంస్కృతిని గుర్తుచేస్తూ ఉంటుంది. వినాయకచవితి అట్టి పండుగలలో మొదటిది. తరువాత వరుసగా విజయదశమి. దీపావళి, సంక్రాంతి, సంవత్సరాది మొదలగు ఎన్నో పండుగలు వస్తాయి. ఒక్కొక్క పండుగ ఒక సందేశాన్ని సమాజానికి అందిస్తూ ఉంటుంది. ఇది మన పరంపర.

భాద్రపద శుక్ల చతుర్థి వినాయక చతుర్థి యని ప్రసిద్ధి. ఆనాడు ప్రతి ఇంట్లో వినాయకుని పూజించుట మన ఆచారం. అసలు ఈ వినాయకుడెవరు? అతడేల ఆరాధ్య దైవమాయెను? అను విషయమును గురించి కొంత వివరిస్తాను.

రాక్షసులు తపమాచరించుచున్న దేవతలను హింసించుచుండగా, వారు పెట్టే బాధలను సహించలేక పరమేశ్వరుని దగ్గరకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. అప్పుడు విఘ్నేరుని సృష్టించి దేవతలొనర్చు తపములకు ఎట్టి విఘ్నములు రాక్షసులనుండి కలుగకుండా చూడమని పంపాడని లింగ పురాణం చెబుతున్నది.

ఒకనాడు పార్వతీదేవి అభ్యంగ స్నానము చేయడానికి వెళ్లుతూ, నలుగుపిండితో ఒక బొమ్మనుచేసి, దానికి ప్రాణంపోసి సింహద్వారంవద్ద అతనిని కాపలాపెట్టి లోనికి ఎవ్వరినీ రానివ్వ వలదని ఆదేశించి అభ్యంగ స్నానమునకు వెళ్ళినదట. ఇంతలో పరమశివుడు పార్వతీదేవితో ఏదో పనివుండి రాగా, సింహద్వారంవద్ద కాపలా కాస్తున్న విఘ్నేశ్వరుడు అడ్డగించగా, శివునికి కోపం వచ్చి, ఉగ్రుడై అతని శిరమును ఖండించెను. అంత పార్వతీదేవి దుఃఖంతో శివుని ప్రార్థించగా, అయినదానికి చింతించి "ఉత్తరదిక్కున శిరమునుంచి నిద్రించువాని శిరస్సును ఖండించి తెచ్చి యీ మొండెమునకు అతికించిన యెడల ఆ బాలుడు బ్రతుకును" అని పార్వతీదేవికి చెప్పగా భటులను వెదుక పంపెను. ఆ భటులు ఎంత వెదికినా ఉత్తర దిక్కున శిరస్సుపెట్టి పడుకొనిన మనిషి కనుపించలేదు చిట్టచివరకి ఒక అడవిలో ఉత్తరదిక్కుకు శిరస్సుపెట్టి పడుకొనిన ఏనుగు ఒకటి వారికి కనుపించగా, దాని శిరమును ఖండించి తీసుకొనిరాగా, ఆ ఏనుగు శిరమును ఆ బాలుని మొండెమునకు కలుపగా, అతను వెంటనే సజీవుడై లేచెను. అతను గజాననుడుగా ప్రసిద్ధి పొందెనని శివపురాణం చెబుతున్నది. అంతేకాదు ఇంకా అనేక పురాణములు వినాయకుడు గజరూపుడని చెబుతున్నాయి.

వినాయకునకు వాహనం మూషికము. మూషికములు తమ వాడి కోరలతో భూమిని తొలిచి, బొరియలు చేసు

కొని తమ నివాసముల నేర్పరచుకొనును. అట్లే బ్రహ్మచారియు తన నిశితబుద్ధితో ఎంతటి అసాధ్యమైన విషయములనైననూ అవగాహన చేసుకొని సాధించగలడనే నమ్మకం కలదు. వినాయకుడుకూడా బ్రహ్మచారేగదా! కనుక ఎలుకకు బ్రహ్మచారియగు వినాయకునకు సంబంధం ఏర్పర్చబడినది.

వినాయకుని ఆకారం కడు విచిత్రంగా ఉంటుంది. ఏనుగ రూపం. చేటలంత చెవులు. ఏకదంతం. బానపొట్ట దీనికీ అంతరార్థం లేకపోలేదు. బానపొట్టగదా! ఇది ధాన్యపు గాదెను సూచిస్తుంది. చేటలులాంటి చెవులుగదా! ధాన్యమును తూర్పారపట్టుటకు చేటలు చాలా అవసరం. ఏకదంతంగదా! ఇది నాగలికి రూపకల్పన. కృషీవలునికి నాగలి అత్యవసరం, తూర్పారపట్టడానికి చేటలు కావాలి. ధాన్యమును నిలువచేయటానికి మట్టిబానలు కావాలికదా! ఆ మట్టిబానలు చెమ్మగిలి శిధిలం కాకుండా ఉండటానికి ఆకులతో, గడ్డితో పత్రములతో కప్పివేయటం పరిపాటి. అదేవిధంగా అనేక రకముల పుష్పములతో, పత్రితో వినాయకుని పూజించటం మన సాంప్రదాయం. కనుక వినాయకుడు మంగళప్రదుడు. పాడిపంటలకు చిహ్నం. అందువలననే మనం ఏ కార్యక్రమం తలపెట్టినా ముందుగా గణపతిపూజ చేస్తాం. తరువాతనే మన ఇష్ట దైవాన్ని ఆరాధించడం మన సాంప్రదాయం. మనమేకాదు దేవతలుకూడా ఆదిలో విఘ్నేశ్వరునే పూజించడం సాంప్రదాయం. ఒక్క మన దేశంలోనేకాదు అనేక దేశాలలో కూడా వినాయకుడ్ని ఆరాధిస్తుంటారు. ఇండోనేషియాలో ముస్లిములు అక్కడి ప్రభువులు. అక్కడకూడా విఘ్నేశ్వరుని ఆరాధించడం జరుగుతున్నది. పాలి పుస్తకాలలో "అవిఘ్నమను" అని ముందుగా మనకు కనిపిస్తుంది. మన దేశంలోకూడా ముఖ్యంగా బాల బాలికలు, విద్యార్థులు వినాయకచవితిని జరుపుకోవడం అనాదిగా వస్తున్న సాంప్రదాయం.

"అవిఘ్నం కురుమేదేవ! సర్వకార్యేషు సర్వదా" అని వినాయకునికి కొబ్బరికాయ కొట్టడం మన ధర్మం. "ఓ దేవా! సర్వకార్యములయందూ, ఎల్లప్పుడూ విఘ్నములు లేకుండా నాకు చేయుము" అని మనం ముందుగా వినాయకుడ్ని ప్రార్థిస్తాం.

వినాయకుడు అనుభవంగల "షార్ట్‌హాండ్ రైటర్" అనడానికికూడా అనేక ఆధారాలున్నాయి. వ్యాసమహర్షి భారతం వ్రాయ సంకల్పించుకొని, తాను చెబుతుంటే వేగంగా ఎవరు వ్రాయగలరా? అని అన్వేషణ ప్రారంభించాడట. దానికి సమర్థుడు ఒక్క గణపతేనని బ్రహ్మదేవుడు సలహా యిచ్చాడట. వ్యాసుడుకూడా గణపతి గంటంతో వ్రాసే వేగమునకు తట్టుకోలేకపోయినాడని పురాణాలు చాటుతున్నాయి. కనుక వినాయకుడు సకల విద్యా పారంగతుడు అనడంలోకూడా ఏమాత్రం అతిశయోక్తి లేదు.

వినాయక చతుర్థినాడు చంద్రుని చూచినచో లేనిపోని అపవాదులు వచ్చి మీదపడుతాయని అనేక గాథలు మనకు తెలుపుతున్నాయి. శ్రీకృష్ణుడు అంతటివాడుకూడా నిందలు మోయవలసి వచ్చిందని "శమంతకోపాఖ్యానము" కథ వినినయెడల ఆ దోషం పోతుందని గణపతే చెప్పినట్లుగా పురాణాలు ఘోషిస్తున్నాయి. కనుకనే మనం ఏపని ప్రారంభించాలనుకొనినా ముందుగా గణపతిని పూజించడం అనాదిగా వస్తున్న మన సాంప్రదాయం.

మనం వినాయకుడ్ని అనేక రకాల పత్రితో పూజిస్తాం, అగరువత్తులు, కర్పూరం వెలిగిస్తాం. మనం పూజించే పత్రిలో క్రిమికీటకాలను, ముఖ్యంగా దోమలను నిరోధించే శక్తిగల ఆకులు ఎన్నో ఉన్నాయి. కలుషితంగా ఉన్న పరిసరాలను శుభ్రం చేయగల శక్తి ఆ పత్రిలోను, ధూపదీపములలోను కలదు. మన పూర్వీకులు దైవచింతనకు, ఆధ్యాత్మికతకు ఎంతటి ప్రాధాన్యత యిచ్చారో, వైజ్ఞానికం (Scientific) గా కూడా అంత పరిశోధన చేసారనే విషయం స్పష్టమవుతున్నది. అనాదిగా వస్తున్న మన సాంప్రదాయాలు కేవలం మూఢాచారాలని త్రోసివేయడం విజ్ఞత అనిపించుకోదు. ప్రతి సాంప్రదాయం వెనుక శాస్త్రసాంకేతిక విజ్ఞానం ఉన్నది. అది తెలుసుకోలేక నవనాగరికులు అవి మూఢాచారాలని త్రోసివేస్తున్నారు తెలుసుకొనే శక్తి సామర్థ్యాలనయినా సంపాదించుకోవాలి. లేనియెడల ఒక నమ్మకంతోనయినా వాటిని పాటించాలి. పూర్వీకులు తెలుసుకొని ఆచరించేవారు. కొంతకాలం జరిగిన తరువాత నమ్మకంతో ఆచరించడం ప్రారంభించాం. ప్రస్తుతం అటు తెలుసుకొనే సామర్థ్యమూ కనిపించడంలేదు. నమ్మకానికి తిలోదకాలివ్వడం జరుగుతున్నది. ఇది మన ప్రస్తుత దురవస్థ. ఇది ఎప్పటికి మారుతుందో! ఏది ఏమైనా విఘ్నములను నివారించు విఘ్నేశ్వరుడ్ని భక్తితో కొలవడం మన సాంప్రదాయం.

— సం.

# స్వార్థ రాజకీయాల ఊబిలో పంజాబ్

పంజాబు సమస్య యొక్క పూర్వాపరాలు పూర్తిగా తెలియకపోయినా, నేడు మనదేశాన్ని పట్టి పీడిస్తున్న విషమ సమస్యగా అందరికి తెలుసు. అయితే విదేశీ ఏజంట్లు పంజాబు ప్రాంతంలో ఎందువలన అల్లకల్లోలాన్ని సృష్టిస్తున్నారు ? స్వార్థ రాజకీయాల ఊబిలో చిక్కుకున్న నాయకులు దేశ సమగ్రతను భద్రతను విస్మరించడానికి ముఖ్య కారణం ఏమిటి ? శ్రీమతి గాంధీ హత్యకు కారకులెవరు ? కారణాలేమిటి ? బింద్రన్‌వాలా పుట్టుపూర్వోత్తరాలేమిటి ? అఖిల భారత సిక్కు విద్యార్థి సమాఖ్య చరిత్ర ఏమిటి ? డా. జగజిత్ సింగ్ చౌహన్ ఎవరు ? దళ్‌ఖాల్సా సంస్థ స్వరూపం ఎట్టిది ? అకాలీదళ్, కాంగ్రెసు పార్టీల పాత్ర ఎటువంటిది ? దేశం తిరిగి విభజింపబడే ప్రమాదముందా ? పాకిస్థాన్ దుష్టపాత్ర ఏమిటి ? యిలా అనేక ప్రశ్నలు భారతీయుల్ని వేదిస్తున్నాయి. ఈ ప్రశ్నలకు చక్కటి సమాధానములు, పంజాబు సమస్య పూర్వాపరాలు, సమస్యల పరిష్కారానికి అవసరమైన సూచనలతో "స్వార్థ రాజకీయాల ఊబిలో పంజాబ్" అనే పుస్తకం ఈ మధ్యనే వెలువడింది. ఇది చదువుతే పంజాబు సమస్యకు అసలు కారణాలేమిటో, కారకులెవరో, పరిష్కారానికి మార్గాలేమిటో బోధపడు తుంది. ఈ పుస్తకంలో ప్రస్తావించబడిన కొన్ని ముఖ్య విషయాలను 'శ్రీవాణి' పాఠకులకు అందించడానికి ప్రచురణ కర్తలు అంగీకరించినందులకు వారికి అభినందనలు. మిగతా వివరాలకోసం పుస్తకాన్ని చదవండి !

## భింద్రన్‌వాలా

ఈతని పేరు తెలియనివారుండరు. తారాజువ్వలా గగనవీధిలోని కెగిరి అనతికాలంలోనే కనుమరుగైన టెర్రరిస్టు నాయకుడు. ఈతను కాంగ్రెసు సృష్టించిన పెనుభూతం. అకాలీదళ్ రాజకీయాలను ఎదురుదెబ్బ కొట్టడానికి ఉపయోగించిన అస్త్రం. అయితే ఆ అస్త్రమే, ప్రయోగించిన కాంగ్రెసు పక్షానికే నష్టాన్ని తెచ్చిపెట్టింది. 1977 తరువాత అకాలీదళ్-జనతా పక్షాల ప్రభుత్వం అధికారంలోకి రావటం కాంగ్రెస్ సహించలేక వారిని అధికారం నుండి తొలగించటానికై రకరకాల రాజకీయ మతపరమైన కోర్కెలను బయటపెట్టడానికి ఎవరు పనికి వస్తారా ? అని ఆలోచించి భూతద్దంతో వెదికి బింద్రన్‌వాలాను కాంగ్రెసు బయటకు తీసుకొని వచ్చింది. 1977 లో శ్రీ జ్ఞాని జైల్‌సింగ్ పంజాబు ముఖ్యమంత్రి పదవిని కోల్పోయారు. ఆయన పదవిలో వున్న కాలంలో అధికార దుర్వినియోగానికి పాల్పడ్డారని, దాని మీద విచారణ జరుపమని గురుదయాళ్‌సింగ్ సంఘాన్ని నియమించింది. ఆ విచారణ నుండి తప్పించుకోలేక ఏదో విధంగా అకాలీదళ్‌ను దెబ్బకొట్టాలనే తలంపుతో సంజయ్‌గాంధీ సూచనతో బింద్రన్‌వాలాను బయటకు లాగారు కాంగ్రెసు పెద్దలు. 1980 ఎన్నికలలో జ్ఞాని జెయిల్‌సింగ్ మరియు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు శ్రీమతి సుఖ్‌జిందర్‌కౌర్ ఎన్నికల ప్రచారంలో బింద్రన్‌వాలా ప్రధాన పాత్ర వహించారు. కాంగ్రెసు విజయం తరువాత బింద్రన్‌వాలా పలుకుబడి పెరిగింది. ఇందిరాగాంధీ రాజీవ్‌గాంధీలు సహితం బింద్రన్‌వాలాను ప్రముఖ సిక్కుల నాయకుడుగా వర్ణించడం జరిగింది. చిట్టచివరికి పార్లమెంటులో కొందరు కాంగ్రెసు పెద్దలు ఆయనను గొప్ప మతపరమైన నాయకుడుగా పేర్కొనినారు. ఆ దెబ్బతో ఆయనలో అహంభావం పెరిగింది. విదేశీ ఏజంట్లతో సంబంధాలు పెరిగాయి. తీవ్రవాదులు ఆయన చుట్టూ చేరారు. విప్లవ శంఖాన్ని పూరించాడు. స్వర్ణ దేవాలయంలో స్థానం ఏర్పర్చుకున్నాడు. పాకిస్థాన్ అండతో ఆయుధాలను సంపాదించాడు. అరాచకత్వాన్ని

పురిగొల్పాడు. గత్యంతరంలేని పరిస్థితులలో సైనిక చర్యను స్వర్ణదేవాలయంమీద ప్రభుత్వం తీసుకోవలసి వచ్చింది. ఆ చర్యలో మరణించారు బింద్రన్‌వాలా.

## డా. జగజిత్ సింగ్ చౌహాన్

ఈయన వయసు 70 సంవత్సరాలు. కమ్యూనిష్టు పార్టీకి చెందిన స్టూడెంట్ ఫెడరేషన్ ద్వారా రాజకీయాల్లోకి ప్రవేశించాడు. శ్రీ యల్. యస్. గిల్ పంజాబు ముఖ్యమంత్రిగా వున్న సమయంలో ఈయన ఆర్థిక మంత్రిగా పనిచేశారు. ఆ తరువాత ఇంగ్లాండు వెళ్ళి వైద్యవృత్తిని చేబట్టారు. ఖలిస్థాన్ పేరుతో అతను చేసే పత్రికా ప్రకటనలను ఎవరూ ఆనాడు పట్టించుకొనేవారు కాదు. 1977 లో ముఖ్యమంత్రి పదవిని చేబట్టిన శ్రీ ప్రకాశ్‌సింగ్ బాదల్‌ని కలిసి పదవికోసం ప్రయత్నించారు. అకాలీదళ్ అతనిని లక్ష్య పెట్టలేదు. అయితే అధికారాన్ని కోల్పోయిన పంజాబు కాంగ్రెసువారు మాత్రం అతనిని దువ్వడం ప్రారంభించారు. అకాలీదళ్‌కు తలనొప్పి ఎలా సృష్టించాలా ? అన్నది వారి ఆలోచన. జెయిల్‌సింగ్ అతనిని చాలాసార్లు కలిసారు. శ్రీమతి గాంధీని కూడా చౌహాన్ కలుసుకున్నారు. అయితే అధికార వ్యామోహంతో బాధపడుతున్న చౌహాన్ ఢిల్లీ జుమ్మామసీద్ షాహి ఇమామ్‌ను కూడా కలిసి సహాయాన్ని కోరారు. ఆ తరువాత ఖలిస్థాన్ కావాలంటూ ప్రకటించారు. 1980 లో తిరిగి ఇంగ్లాండు వెళ్ళారు. 1980 జూన్‌లో బల్బీర్‌సింగ్ సంధూ ఖలిస్థాన్ స్థాపనను ప్రకటిస్తూ, ఖలిస్తాన్ జాతీయ మండలి అధ్యక్షుడుగా చౌహాన్‌ను ప్రకటించారు. చౌహాన్ పాకిస్థాన్‌ను పలుసార్లు సందర్శించారు. విదేశీ సంస్థలు చౌహాన్‌కు భూరి విరాళాలు యిచ్చాయి. భారతదేశానికి తన బంధువుల ద్వారా చాలా డబ్బు పంపించాడు. చౌహాన్‌కు అమెరికాలో జనరల్ డానియర్ గ్రాహమ్‌తో, సెనెటర్ మార్క్ హేట్‌ఫీల్డ్‌తో, సెనెటర్ జెస్సీహెల్మ్స్‌తో, సెనెటర్ సామ్‌సన్‌లో మంచి సంబంధాలున్నాయి. పంజాబ్ అకాలీ నాయకులు తోహ్రా, తల్వాండి, అకాలీతక్త్ ప్రధాన పూజారి గురుదయాళ్ సింగ్‌లు చౌహాన్ యెడల సానుభూతిని ప్రదర్శిస్తూ వచ్చారు. ఖలిస్థాన్ జాతీయ మండలిని 1982 లో నిషేధించారు.

## నేత్రోదయం

మనసు గదికున్న చైతన్యపు గుమ్మాలూ
చదవ దలచుకున్న పుస్తకాల కిటికీలూ,
మూసివేసి చీకటి చేస్తున్నారెవరు ?
సమదృష్టిని దర్శించే అమృత కిరణాలను
మృత నేత్రాలుగా మారుస్తున్నారెవరు ?
నా మెదడు పుస్తకంలోని ఆలోచనను
మొదలంటా తగలెడతారేం ?
వెలుగేగా నీక్కావాలంటూ
వికటంగా నవుతారేం ?
ఖబడ్దార్...
చర్యకు ప్రతిచర్యగా
సంకల్పిత ప్రతీకార చర్యగా
విచ్చుకొంటోంది అంతర్నేత్రం
కన్ను చూసిన కాంతి
క్రాంతి కిరణాలై కొత్త చూపుతో
పిడి బాకుల్లా కొత్త ఊపుతో
రక్తాన్ని చిమ్ముకుంటూ...
కిరణాల్ని పంచుకుంటూ...

— తాతా రమేష్‌బాబు

## సిక్కు విద్యార్థి సమాఖ్య

కమ్యూనిస్టు పార్టీల ప్రభావం రైతాంగంలో పెరుగుతోందని భయపడ్డ అతివాదులు–సిక్కు విద్యార్థి సమాఖ్యలో చేరి దానిని తమ స్వంతం చేసుకున్నారు. కమ్యూనిస్టు పార్టీల కంటె వీరి మాటలు ఉద్రేకాన్ని కలిగిస్తూ,

## విశ్వజనీనత

ఆకు కూరలూ-
కూరగాయలూ-
ఫల పుష్పాలూ-
వీటిలో వున్న విశ్వ జనీనత
కోటి కొక్కడి కైనా మనుషుల్లో లేదు.
ఏ మూలో పూస్తాయి కాస్తాయి
ఎకాఎకిన ఎగిరి వస్తాయి రెక్కలుకట్టుకొని-
సందు గొందులకు,
అందరికీ చెందాలని
అందరూ ఆనందించాలని.
అత్తి పత్తిలా ముడుచుకోవడం
బొత్తిగా తెలియని విశ్వాత్ములవి.

— కమల్

యువకులను ఆకర్షిస్తున్నాయనే భ్రమతో అకాలీదళ్ కూడా వీరిని సమర్థించడం ప్రారంభించింది. డమ్ డమా సాహెబ్ అధిపతి సంత్ కర్తార్‌సింగ్ కుమారుడు భాయి అమ్రిక్‌సింగ్ ఈ సంస్థలో చేరి అధ్యక్షుడయ్యాడు. సంత్‌కర్తార్‌సింగ్ తరువాత డమ్ డమా సాహెబ్‌కు అధిపతి అయిన బింద్రన్‌వాలా, తన గురువుగారి కుమారుని తన ధార్మిక సోదరునిగా భావించి, అమ్రిక్ సింగ్‌ను తన ముఖ్య సలహాదారునిగా స్వీకరించాడు. 1980 తరువాత ఈ సంస్థ బింద్రన్‌వాలా జేబు సంస్థగా మారింది. ఇందులో కిరాయి హంతకులు, గూండాలు చేరారు. ఈ సంస్థకు విదేశాలలో శిక్షణ శిబిరాలున్నాయి.

### దళ్ ఖాల్సా

1978 ఏప్రియల్ నెలలో అకాలీలకు నిరంకారీలకు మధ్య జరిగిన సంఘర్షణల తరువాత ఈ సంస్థ ప్రారంభమైంది. 1978 ఆగస్టు 6 న చండీఘర్‌లో అకాత్ గడ్ గురుద్వారాలో తీవ్రవాదుల సమావేశం జరిగింది. దానిలో ఈ సంస్థకు జస్వంత్ సింగ్‌ఠే కేదార్, హర్సి మ్రాన్‌సింగ్, గజేందర్‌సింగ్, సత్నామ్‌సింగ్, హర్ భగవత్‌సింగ్ నారున్‌వాల్‌లు నాయకులుగా ఎన్నుకోబడ్డారు. ఈ సంస్థకు సభ్యత్వం లేదు. చందాలు వసూలు చేయటం లేదు. అయితే ఎప్పుడూ కూడా వారికి డబ్బు కొరత లేదు. ప్రారంభంనుంచీ ఈ సంస్థ తీవ్ర వాదాన్నే అనుసరిస్తూ వచ్చింది. ఆనాడు అధికారంలో ఉన్న అకాలీదళ్-జనతా ప్రభుత్వాన్ని ఇరకాటంలో పెట్టడానికోసం రాష్ట్రకాంగ్రెసు నాయకత్వం వీరికి ఆర్థికంగా సహాయంచేసి ప్రోత్సహించింది. 1982 మార్చిలో ఆనందపూర్ సాహెబ్ వద్ద ఖలిస్తాన్ జండాను ఎగురవేసి, ఖలిస్తాన్ పటాలను వీరు పంచిపెట్టారు. హత్యలకు, దారి దోపిళ్ళకు కారకులు వీరే. ఈ సంస్థను నిషేధించమని ఆనాడు కేంద్ర ప్రభుత్వాన్ని దర్బారాసింగ్ తరచు కోరుతున్నా అయన ప్రత్యర్థి, ఆ నాటి కేంద్ర దేశీయాంగమంత్రి జ్ఞాని జెయిల్‌సింగ్ నిషేధాన్ని వ్యతిరేకిస్తూ వచ్చారు. వీరి నాయకులలో ఒకరైన హర్సిమ్రాన్‌సింగ్‌ను అరెస్టు చేసిన తరువాత ఆయన దళ్‌ఖాల్సాకు సహాయం చేసిన వారి పేర్లు చెప్పడం జరిగింది. జెయిల్‌సింగ్, బూటాసింగ్, తల్వండీల పేర్లు ఆయన చెప్పిన పట్టికలో ఉండటం విశేషం. ఈ సంస్థనుకూడా 1982 లో నిషేధించారు.

ఈ పుస్తకాన్ని చదువుతే మనకు ఒక విషయం బోధపడుతుంది. సంకుచిత, స్వార్థ రాజకీయాలతో, అధికారాన్ని ఏదోవిధంగా చేబట్టాలనే తలంపుతో అకాలీదళ్, కాంగ్రెసు నాయకులు ఆడిన స్వార్ధ రాజకీయాలకు పంజాబ్ బలి అయిందని, తద్వారా దేశంలో మారణ హోమం సృష్టించబడి అశాంతి పెచ్చు పెరిగిపోతున్నదని భావించవలసి వస్తున్నది. అధికార వ్యామోహం ఎంతటి నీచానికైనా మనుషులను దిగజారుస్తుందనడానికి పంజాబు సమస్య ఒక చక్కని ఉదాహరణ. ఈ స్వార్ధ రాజకీయాల ఊబినుండి మనం ఎప్పటికి బయట పడుతామో !

మేధావులు తప్పనిసరిగా చదువవలసిన ఒక మంచి విమర్శనాత్మక గ్రంథం, రాజకీయాల ఊబిలో పంజాబ్. వెల : రు. 5-00

ప్రతులకు :

సాహిత్య నికేతన్
3-4-852 బరకత్‌పూరా
హైదరాబాద్ 500 027

సాహిత్య నికేతన్
ఏలూరు రోడ్
విజయవాడ- 2

**

## బహుముఖ ప్రజ్ఞాశాలి

# డా॥ సర్వేపల్లి రాధాకృష్ణన్

**మైసూరు** విద్యాలయంలో అప్పటివరకు ప్రొఫెసర్‌గా పనిచేసిన ఆయన కలకత్తా విశ్వవిద్యాలయంలో పనిచేయడానికి నిర్ణయించుకున్నారు. ఆయనను స్టేషన్‌కు తీసుకొనివెళ్ళడానికి గుర్రపుబగ్గీ ఇంటిముంగిట సిద్ధంగా వుంది. ఆయన బగ్గీలో ఎక్కి కూర్చున్నారు వెంటనే. అంతకు రెండేళ్ళ క్రితంనుంచి ఆయనవద్ద విద్యాభ్యాసం చేస్తున్న విద్యార్థులు బగ్గీకి కట్టివున్న గుర్రాలను వదిలివేసి తామే బగ్గీని స్టేషనువరకు లాక్కువెళ్ళారు. తమ అధ్యాపకునిపట్ల వారికి ఎంత భక్తి ! ఎంత గౌరవం ! మరెంతటి అనురాగం ! తన విద్యార్థులు తనపట్ల ప్రదర్శించిన అలాంటి ప్రేమాదరాలకు కళ్ళు చెమ్మగిల్లాయి. వారి హృదయాలలో తనకు అంతటి స్థానమున్నదని ఆయన ఊహించలేదు.

అధ్యాపకులను అవహేళనచేసే ఇప్పటి పరిస్థితులలో పోల్చితే, తన విద్యార్థుల ఆదరాభిమానాలను అంతగా చూరగొన్న ఆ ప్రొఫెసర్ ఎంత అదృష్టవంతుడు ! అది ఆయన స్వరాష్ట్రంకాదు. అక్కడ ఆయనవున్న కాలమైనా రెండేళ్ళకు మించలేదు. అంత స్వల్పకాలంలోనే విద్యార్థుల హృదయాలపై చెరగని ముద్రవేసిన ఆ ప్రొఫెసర్ బోధనాశక్తి, గుణగణాలు ఎంత గొప్పవై వుండాలి.

ఆనాడు మైసూరునుంచి కలకత్తా వెడుతున్న డా. సర్వేపల్లి రాధాకృష్ణన్‌పట్ల అంతటి ప్రేమానురాగాలను ప్రదర్శించింది కొందరు విద్యార్థులుమాత్రమే, కాని రాష్ట్రపతి పదవినుంచి విరమిస్తున్నప్పుడు డా. సర్వేపల్లి అశేష భారత ప్రజాకోటి హృదయాలలోనే ఆత్మీయమైన స్థానాన్ని సంపాదించుకున్నారు. రాష్ట్రపతి హోదాలో ఈ మహామనీషి సేవలు దేశానికి మరికొంతకాలం లంభించక పోవడం చాలామందికి బాధ కలిగించింది. పదేళ్ళు ఉపరాష్ట్రపతిగాను, అయిదేళ్ళు రాష్ట్రపతిగాను – ఆ రెండు పదవులకు ఆయన చేకూర్చిన హుందాతనం, ప్రతిష్ఠ ప్రతి భారతీయుని అలరించాయి. ఆయనకుముందు ఇండియా వైస్‌ప్రెశిడెంటు పదవి నిర్వహించినవారు లేక పోవచ్చుగాని, ఆయనకుముందు రాష్ట్రపతి పదవిని నిర్వహించింది సామాన్యమైన వ్యక్తికాదు. అజాత శత్రువని పేరెన్నికగన్న రాజన్‌బాబు తరువాత ఆ పదవిని నిర్వహించడం అంత సులభంకాదు. కాని, రాజన్‌బాబు వలెనే రాధాకృష్టన్ సయితం అజాత శత్రువు. రాష్ట్రపదవికి ఆ జాతీయ మహానాయకుడు తన సేవాత్యాగంచేత మహోన్నతత్య భావాన్ని సమకూర్చగా, ఈ ప్రపంచ ప్రఖ్యాత తత్వవేత్త తన విజ్ఞాన విభవంతోను, పాండితీ గరిమతోను, విశ్వజన దృక్పథంతోను దానికి మాన్యతను కూర్చారు.

తుర్లపాటి కుటుంబరావు

### జననం, విద్యాభ్యాసం

జవహర్‌లాల్ నెహ్రూవలె ఆయన అగర్భ శ్రీమంతుల కుటుంబంలో జన్మించలేదు. శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణన్ తండ్రి శ్రీ వీరాస్వామయ్య ఒక జమీందారీలో తహసిల్‌దార్. తొలి విద్యాభ్యాసం తిరుత్తనిలోను, తిరుపతిలోను కాగా, రాయవెల్లూరులోని అమెరికన్ మిషన్ కాలేజీలోను, మద్రాసు క్రిస్టియన్ కాలేజీలోను చదివి ఆయన ఎమ్. ఏ. డిగ్రీ తీసుకున్నారు. వ్యక్తిత్వం ఆయనకు వెన్నతోపెట్టిన విద్యా ? అనిపిస్తుంది. విద్యార్థిగా ఉండగానే ఆయన వాక్పటిమ ప్రొఫెసర్లనుసహితం అలరించగా, ఆయన



5.9.1888

" National integration cannot be built by brick and mortor, by chisel and hammer, but it has to grow silently in the minds and hearts of men. "

- Dr. SARVEPALLI RADHAKRISHNAN

వచోవిభవం తోటి విద్యార్థులను ఉర్రూత లూగించేది. ట్రెయినింగ్ కాలేజీలో చదువుతుండగానే మానసిక శాస్త్రంపై ఆయనచేసిన ఉపన్యాసాలు ఆయన భావిజీవితానికి సూచకాలు. గంభీరమైన కంఠధ్వని, ఆకర్షణీయమైన ఉచ్చారణ, వేదశ్లోకాలను స్ఫుటంగా, స్పష్టంగా ఉచ్చరించగల నేర్పు, భావనైశిత్యం ఆయనలోని ప్రత్యేకతలు. 21 సంవత్సరాలైనా లేని వయస్సులో ఆయన మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో ప్రొఫెసర్‌గా ఉన్నారు. అప్పుడే ఆయన పేరు ప్రఖ్యాతులు, తత్వశాస్త్రంలో ఆయన అపార విజ్ఞానం అటు కలకత్తా విశ్వవిద్యాలయం, ఇటు మైసూరు యూనివర్సిటీకి ప్రాకాయి. మైసూరు యూనివర్సిటీలో తత్వశాస్త్రాధ్యాపకత్వాన్ని నిర్వహిస్తూవుండగానే, ఆనాటి కలకత్తా యూనివర్సిటీ వైస్‌ఛాన్సలర్ సర్ అశుతోష్‌ముఖర్జీదృష్టి ఆయనపై బడింది. కలకత్తాలో ఆయన తాత్వికచింతన కొత్తపుంతలు తొక్కింది. అప్పుడే ఆయన వ్రాసిన "భారతీయ తత్వశాస్త్రం" ప్రపంచంలోని తత్వవేత్తలను ఆకర్షించింది. సి. ఇ. ఎమ్. జోడ్‌వంటి పాశ్చాత్య తత్వవేత్తల దృష్టిలో ఆయన ప్రాచ్య తత్వశాస్త్రానికి ప్రతినిధి అయినారు.

"మీరు ఆక్స్‌ఫర్డులోనో, కేమ్‌బ్రిడ్జిలోనో డిగ్రీ తీసుకుంటే మీ విలువ మరింతగా పెరుగుతుంది" అని ఆరోజులలో ఒక ఐ. సి. ఎస్. ఆఫీసర్ శ్రీ రాధాకృష్ణన్‌కు సలహాయిచ్చారు. "నేను అక్కడికి వెడితే విద్యార్థిగా కాదు. అధ్యాపకుడిగా మాత్రమే" అని ఆయన ఎంతో ఆత్మవిశ్వాసంతో ప్రత్యుత్తరమిచ్చాడు. అయితే ఆమాటలు అన్న ఆరు సంవత్సరాల తరువాత ఉపన్యాసాలివ్వవలసిందిగా ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీవారు ఆయనను ఆహ్వానించారు. ఆ సంవత్సరం అనగా 1926 సం॥లో ఆక్స్‌ఫర్డ్ లోనేకాక, అమెరికాలోనయితం ప్రాచ్య తత్వశాస్త్రంపై ఉపన్యాసాలవర్షం కురిపించగా, అమెరికా, బ్రిటన్‌ల ప్రజలకు సన్నటి, పొడుగాటి ఈ తరుణ భారతీయ అధ్యాపకునిలో ప్రాచ్య, ప్రాశ్చాత్య తత్వశాస్త్ర సమన్వయవేత్త గోచరించాడు. మూడు యూనివర్శిటీలలో (మద్రాసు, మైసూరు, కలకత్తా) అధ్యాపకుడుగా ఉన్న తరువాత ఆయన 1931లో డా॥ సి. ఆర్. రెడ్డి తరువాత ఆంధ్ర యూనివర్శిటీ వైస్‌చాన్సలర్ పదవిని అధిష్టించారు ఆ పదవిలోనున్న అయిదేళ్ళలోను, అప్పటికి అయిదేళ్ళ క్రితం స్థాపించబడిన ఆ సంస్థకు పునాదులను గట్టిచేయడానికి పాటుపడ్డారు. ఆసంస్థ లైబ్రరీకి కొన్ని క్రొత్త గ్రంథాల చేర్పుకు కృషిచేశారు.

## అంతర్జాతీయ ప్రతిష్ఠ

1931న ఆయన నానాజాతి సమితికి చెందిన "ఇంటలెక్చ్యుయల్ కోపరేషన్ కమిటీ"లో సభ్యులుగా నామినేట్ చేయబడ్డారు. 1936లో ఆయన ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలో ప్రాచ్యమతాల అధ్యాపకుడిగా నియమించబడ్డారు. భారతీయునికి ఇది విశిష్టమైన గౌరవమని చెప్పాలి. ఇంచుమించు అదే సమయంలో చైనా ప్రభుత్వ ఆహ్వానంపై ఆయన ఆ దేశం వెళ్ళి అక్కడ ప్రాచ్య దార్శనిక శాస్త్రాలపై ఉపన్యాసాలిచ్చారు. పదునాలుగు యూనివర్శిటీలలో ఉపన్యాసాలివ్వడానికి 1946లో ఆయనను అమెరికా ప్రభుత్వం ఆహ్వానించగా, ఆయన వచోవిభవం మరొకసారి అమెరికన్‌లను ముగ్ధులను చేసింది. 1946లోనే ఏర్పడిన భారత రాజ్యాంగ పరిషత్‌లో ఆయన సభ్యుడుగా నియమించబడినాడు. 1947 సం॥ ఆగస్టు 14–15వ తేదీన అర్ధరాత్రి స్వాతంత్ర్య "భానూదయ" మైన అర్ధరాత్రి శ్రీ నెహ్రూ తరువాత డా. రాధాకృష్ణన్ చేసిన మహోపన్యాసం సభ్యులను ఉత్తేజితులను చేసిందని దాన్ని విన్నవారు ఇప్పటికీ

అంటూవుంటారు. 1949 లో ఉన్నత విద్యాసంస్కరణలకు ప్రభుత్వం ఒక కమిటీని నియమిస్తూ దానికి డా. రాధాకృష్ణన్‌ను అధ్యక్షునిగా నియమించింది. ఆ కమిటీ నివేదిక శ్రీ నెహ్రూను ఎంతగానో ఆకర్షించింది. రష్యాలో రాయబార పదవికి డా. రాధాకృష్ణన్ కడు సమర్థుడని శ్రీ నెహ్రూగారు భావించి నియమించారు. ఇది ఆయన జీవితంలో ఒక ముఖ్యమైన మలుపు.

## స్టాలిన్‌తో ఇంటర్వ్యూ

డా. రాధాకృష్ణన్‌ను ఆ పదవిలో నియమించడానికి చాలా ప్రాధాన్యమున్నది. ఎందువల్లనంటే, అంతకు పూర్వం శ్రీమతి విజయలక్ష్మి పండిట్ 18 మాసాలపాటు రష్యాలో రాయబారిణిగా ఉన్నప్పటికీ, ఆమెకు రష్యా అధినేత మార్షల్ స్టాలిన్‌తో ఇంటర్వ్యూ లభించలేదు. అలాంటి పరిస్థితులలో శ్రీ రాధాకృష్ణన్ నియామకం చాలా మందికి ఆశ్చర్యం కలిగించింది. అంతకుపూర్వం దౌత్య వ్యవహారాలతో ఆయనకు పరిచయం లేదు. పైగా రాధాకృష్ణన్ తత్వానికి, స్టాలిన్ తత్వానికి ఎక్కడా పొంతనేలేదు. ఈయన తత్వవేత్త అయితే ఆయన భౌతిక వాది; ఈయన సౌమ్యుడైతే, ఆయన కరుకుతనానికి మారుపేరు. అలాంటి పరిస్థితులలో రాధాకృష్ణన్ రష్యాలో ఏమిచేయగలరని ఎవరైనా ఆశ్చర్యపడటంలో తప్పేమున్నది. కాని,రోజుకు పద్దెనిమిది గంటలు పుస్తక పఠనంలోనే నిమగ్నుడై వుంటారని రాధాకృష్ణన్‌ను గురించి విన్నప్ప[illegible]చి, ఆయనను చూడాలని ఆ కమ్యూనిస్టు [illegible]కు కోర్కె కలిగిందట. అందువల్ల రాధాకృష్ణన్ మాస్కో వెళ్ళిన కొద్దికాలానికే ఆయనకు స్టాలిన్‌తో ఇంటర్వ్యూ లభించింది. సాధారణంగా స్టాలిన్ విదేశీ రాయబారులను చూడ్డం జరిగేదికాదు. ఈవార్త ప్రపంచ రాజధానులలో ఆశ్చర్యాన్ని కలిగించింది. 1952 లో ఉపాధ్యక్ష పదవికి పోటీచేయడానికి ఇండియాకు తిరిగివస్తున్నప్పుడు స్టాలిన్ కోరికపై డా. రాధాకృష్ణన్ ఆయనను కలుసుకున్నారు. ఈసారి స్టాలిన్ ఆరోగ్య

### ఓదార్పు

పున్నమి వెన్నెల
కన్ను మూసిందని
ఉషస్సు
కన్నీరు
కక్కుతుంటే-
భానుడు
వెలుగు
చిరంజీవి
అనే
సత్యాన్ని
చాటుతూ
తడి చెక్కిలి
తుడి చేశాడు.

— ఉమ్మిటి విఘ్నేశ్వరరావు

పరిస్థితిలో మార్పు కనిపించింది. ఆయన బుగ్గలను, తలను నిమిరి, ఆయనవీపుపై డా. రాధాకృష్ణన్ తట్టేసరికి ఆ నియంత విచలితుడైపోయాడట. బహుశా ఏ విదేశీ రాయబారి అంతవరకు స్టాలిన్‌కు అంత సన్నిహితత్వంలోకి వెళ్ళివుండడు. తనను అందరూ రాక్షసుడుగా చూస్తున్న సమయంలో రాధాకృష్ణన్ చూపిన అనురాగం తనను కదిలించివేసిందని, తాను మరెంతోకాలం బ్రతకకపోవచ్చునని స్టాలిన్ రాధాకృష్ణన్‌తో అన్నాడట. ఆతరువాత 10 సంవత్సరాలపాటు ఉపాధ్యక్షుడిగా ఆ పదవి ప్రతిపత్తిని పెంచడమేకాక, ఆ హోదాలో వివిధ దేశాలు పర్యటించి, అంతర్జాతీయ రంగంలో మన అంతస్థును కూడా పెంచారు. కేవలం తత్వవేత్త కాదని, రాజకీయ విజ్ఞుడనని కూడా అనిపించుకున్నాడు శ్రీ రాధాకృష్ణన్.

## రాష్ట్రపతి పదవి

1962 లో రాజెన్‌బాబు రాష్ట్రపతి పదవినుంచి విరమించినప్పుడు డా. రాధాకృష్ణన్ ఆ పదవికి సహజంగానే ఎన్నికైనారు. తత్వవేత్తలు రాజ్యాధిపతులైనప్పుడే ప్రపంచం బాగుపడుతుందని మూడువేల సంవత్సరాలనాడు "ప్లేటో" అన్న మాటలు నిజమైనాయి. రాష్ట్రపతిగా ఆయన అనేక దేశాలు సందర్శించినప్పుడు విశిష్టమైన ఆయన వ్యక్తిత్వం, అనన్య సాధ్యమైన ఆయన వక్తృత్వ పటిమ, ప్రాచ్య పాశ్చాత్య తత్వశాస్త్రాలపై ఆయనకుగల అధికారం ఆయా దేశాలవారిని అలరించాయి.

రష్యాలో రాయబారిగా నియమించబడే వరకు రాధాకృష్ణన్‌కు రాజకీయాభిప్రాయాలు లేవని కొందరు అంటారు. ఇది సరికాదు. స్వాతంత్ర్యోద్యమం సాగుతున్న సమయంలోనే ఆయన తీవ్రవాది. ఆయనకు మితవాదులంటే నచ్చేదికాదు. వారు ఏ సమస్యనూ వాస్తవిక దృక్పథంతో పరిశీలించలేరని ఆయన విమర్శించేవారు. మితవాదులు బ్రిటీషు ప్రభుత్వానికి కేవలం విన్నపాలు పంపితే లాభంలేదని ఆయన హెచ్చరించేవారు. గాంధీజీ నాయకత్వమే శరణ్యమని ఆయన పాశ్చాత్య రాజ్యాలకు హితబోధ చేశారు. భారతదేశానికి స్వాతంత్ర్యం లభించనంత వరకు బ్రిటీషువారి కోరిక ఫలించదని ప్రథమ ప్రపంచ సంగ్రామ సమయంలో ఆయన "భారతదేశం....యుద్ధం" అన్న శీర్షికలో వ్రాసిన వ్యాసంలో పేర్కొన్నారు. ఈ వ్యాసంలోని మొదటిభాగం మాత్రం ప్రచురించబడింది. కాని రెండవభాగం మరింత తీవ్రంగా వున్నందున దాని ప్రచురణను అధికారులు నిషేధించారు. తరువాత 1927లో తాను రచించిన "భారతీయ తత్వశాస్త్రం" అన్న గ్రంధం రెండవ భాగంలో ఆయన ఇలా వ్రాశారు. "బ్రిటీషు పరిపాలన భారతదేశానికి శాంతి భద్రతలను ప్రసాదించింది. అయితే ఏజాతికైనా అవి అంతిమ లక్ష్యాలుకావు. రాజకీయ భద్రత, ఆర్థిక సుస్థిరత్వం ఎంత అవసరమైనా, మరెంత అమూల్యమైనవైనా, ఆధ్యాత్మిక స్వాతంత్ర్య సాధనకు అవి మార్గాలు మాత్రమే ఆధ్యాత్మిక లక్ష్యాలను విస్మరించే పరిపాలనా వ్యవస్థ, అది ఎంత నిజాయితీతో కూడినట్టిదైనా ప్రజలలో ఎలాంటి చైతన్యాన్ని పూరించజాలదు."

## నిర్భీక విమర్శకుడు.

ఆరోజులలో బ్రిటీష్ విద్యాసంస్థలలో పనిచేస్తూ వున్నవారు బ్రిటీష్ ప్రభుత్వాన్ని విమర్శించడమంటే సామాన్య విషయంకాదు. 1934 లో శ్రీ రాధాకృష్ణన్ అలహాబాదు యూనివర్శిటీలో స్నాతకోపన్యాసమిస్తున్నారు. ఆ సభకు అధ్యక్షులు ఎవరోకాదు - గవర్నర్ సర్‌మాల్కంహై. ఆ సభలో శ్రీ రాధాకృష్ణన్ గాంధీజీని విశేషంగా ప్రశంసించారు. గవర్నర్ అధ్యక్షత వహించిన సభలో ప్రభుత్వాన్ని పడగొట్టడానికి ప్రయత్నిస్తున్న వ్యక్తిని ప్రశంసించటమంటే మాటలుకాదు.

## ఛలోక్తులు

ఎంత మహా తత్వవేత్త అయినా, ఆయన ఉపన్యాసాలలో ఛలోక్తులు, హాస్యోక్తులు దొర్లుతూనే ఉంటాయి. ఒకసారి సర్ మహమ్మద్ ఉస్మాన్, డా॥ రాధాకృష్ణన్ కలిసి ఒక సభలో మాట్లాడుతున్నారు. సర్‌మహమ్మద్ ఉస్మాన్‌ను గురించి డా॥ రాధాకృష్ణన్ ఇలా అన్నారు. "శ్రీ ఉస్మాన్ నాకు చాలా సన్నిహితుడు. ఆయన కాలేజీలో మొదట నాకు సీనియర్; ఆతరువాత నా క్లాస్‌మేట్; పిమ్మట నాకంటే జూనియర్; ఆ తర్వాత నేను ప్రొఫెసర్‌గా వున్నప్పుడు ఆయన వైస్-చాన్సలర్; నేను వైస్ చాన్సలర్‌గా వున్నప్పుడు ఆయన 'ఛాన్సలర్'" దీనిలోని వ్యంగ్యోక్తిని గమనించవచ్చు.

## అద్భుతమైన జ్ఞాపకశక్తి

శ్రీ రాధాకృష్ణన్ జ్ఞాపకశక్తి అద్భుతమైనది. ఒకసారి అన్నామలై యూనివర్శిటీలో ఆయన స్నాతకోపన్యాసం. రేపు ఉత్సవమనగా, పత్రికా విలేఖరులు ఆయనవద్దకువెళ్ళి తమ పత్రికలకు ముందుగా పంపటానికి అయన ఉపన్యాసం ప్రతిని యివ్వమన్నారు. తాను మరునాడు యివ్వబోయే

ఉపన్యాసాన్ని ఆయన ఆశువుగా చెప్పారు. వారు వ్రాసుకుని పత్రికలకు పంపారు. అయితే, వారి గుండెలలో దుడుకుగానే ఉంది....రాధాకృష్ణన్ మరునాడు మరొక విధంగా చెబుతారేమోనని! కాని మరునాడుకూడా ఆయన ఆశువుగా ఆ క్రిందటిరోజున పత్రికా విలేఖరులకు చెప్పిన ఉపన్యాసాన్నే తు చ. తప్పక చెప్పారు. విలేఖరులు ఆయన ధారణాశక్తికి ఆశ్చర్యపోయారు.

## త త్వ చిం త న

హిమాలయాలలో కూర్చుని ముక్కు మూసుకొని తపస్సు చేయడమనేది ఆయన తత్వచింతనకాదు. భగవానునితోపాటు మానవులుకూడా సృష్టికర్తలేనని, పరిస్థితులతో పోరాడి చెడుగును, అసమానతను నిర్మూలించి, మానవ జీవితంలో మంచిని పెంచాలని ఆయన ఉద్దేశ్యం. ఉత్తమ సమాజ నిర్మాణానికై సాంఘిక పరిస్థితులు పరిపక్వమయ్యేవరకు మానవుడు చేతులు ముడుచుకు కూర్చోరాదని, గతి తప్పిన చరిత్ర ప్రవాహాన్ని సరైన మార్గంలోకి మళ్ళించడానికి మానవుడు పోరాడవలసివుంటుందని ఆయన అభిప్రాయం. మతాన్ని సక్రమంగా అర్థంచేసుకుంటే అది వ్యక్తి విలువను, హుందాతనాన్ని పెంచుతుందని ఆయన విశ్వాసం. మానవునిలోని మానవతకు, అమానుషత్వానికి మధ్య జరుగుతున్న సంఘర్షణలో మానవతకు విజయం చేకూర్చి, మానవుని సమగ్రవ్యక్తిగా రూపొందించడమే మతం లక్ష్యం కావాలని ఆయన భావన.

అహింసద్వారా ప్రపంచ సమైక్యాన్ని, వసుధైక కుటుంబాన్ని సాధించాలని ఆయన లక్ష్యం. అంతటి మహోదాత్త ఆశయ సంపన్నుడు, మహా తత్వవేత్త మనకు రెండవ రాష్ట్రపతిగా లభించడం మన భాగ్య విశేషం. అట్టి బహుముఖ ప్రజ్ఞాశాలి డా॥ రాధాకృష్ణన్ భారతీయులకు గర్వకారకుడు.

Died on 16-4-75 at Mad

# టెలివిజన్

యస్. యన్. దుర్గారావు

రేడియో వలెనే నేడు టెలివిజన్ కూడా ఎంతో అభివృద్ధి చెందినది. దాదాపు రేడియో ఉన్నట్లుగానే చాలా మంది గృహములలో ఈ T. V. కూడా కనిపిస్తుంది. ఈ లెక్కన దాదాపు నూటికి 50-60 శాతం టీ. వీ. చూస్తున్నట్లు అంచనా.

టీ. వీ. చూడటం వలన సాంఘిక, ఆర్థిక, సామాజిక వైజ్ఞానిక విషయాలెన్నెని తెలుస్తాయి అనటంలో సందేహము లేదు. అలా అని గంటల తరబడి చూస్తే ఆరోగ్యం చెడక తప్పదు.




టీ. వీ తప్పక చూడదలిచేవారు కొన్ని ఆరోగ్య సూత్రాలు పాటిస్తే చాలా మంచిది.

మానవుని ఆరోగ్యంపై టీ. వీ. ప్రభావం ఎలా వుంటుందోనని U. S. S. R లో జరిపిన పరిశోధన వలన కొన్ని వాస్తవాలు వెల్లడైనాయి.

టి. వీ. చూసేటపుడు మధ్యలో కూర్చోకుండా, ఎదురుగా కాకుండా కొంచెం ప్రక్క వాలుగా కూర్చొని చూడాలి. ప్రక్కగా కూర్చుని చూసేవానికన్నా ఎదురుగా వుండి చూసే వారిపై విద్యుత్ ప్రభావము ఎక్కువగా ఉంటుంది. ఇక్కడ టీ వీ కి, చూసే వారికీ మధ్య దూరమెంత ఉంటే మంచిది అనే సందేహము కూడా కలుగుతుంది. 2.5-3.0 మీటర్ల దూరములో కూర్చొని చూడటం ఎంతైనా మంచిది.

టీ వీ చూసేటపుడు కరెంట్ దీపాలుండాలి. చీకట్లో చూస్తే కంటి గ్రహణ శక్తి క్రమంగా తగ్గిపోతుంది.

టీ వీ ని సుమారు అరగంటసేపు చూడవచ్చు. మరల అరగంట విరామం తరువాత చూస్తే మంచిది. అదే పనిగా 3 లేక 4 గంటలు చూచేవారి గ్రహణ శక్తి క్రమేపీ తగ్గిపోతుంది, కంటిలోని అతిసున్నితమైన నరాలు దెబ్బ తింటాయి. కళ్ళు బాగా అలసిపోయి తలనొప్పి, తద్వారా మానసిక అలసట కలుగుతుందనటంలో ఏ మాత్రం సందేహం లేదు. ఈ విధంగా మానసిక అలసట తరచూ కలుగుతుంటే టీ వీ యే కారణమని గుర్తించరు కొందరు.

పిల్లలను టీ వి ని ఎక్కువసేపు చూడకుండా తల్లి తండ్రులు కట్టుదిట్టం చేయాలి. పిల్లలు 15-20 ని॥లు సేపు కంటే ఎక్కువసేపు చూడకూడదు 15 సం॥లలోపు పిల్లలు రోజుకు గంటకు మించకుండా వారానికి రెండు మూడు సార్ల కంటే ఎక్కువసేపు చూడరాదని USSR సంస్థ తెలియ జేసింది.

పై ఆరోగ్య సూచనలను పాటిస్తే ఆరోగ్యానికి ఎంతో మేలు.



## రుచి

"అమ్మా" అన్న
తీయని తెనుగు పదం కంటే
"మమ్మీ" అన్న
అన్య భాషాపదమే
మన కిష్టం !
పొరుగింటి పుల్లకూర
రుచి కదా మరి !

— నారంశెట్టి ఉమామహేశ్వరరావు

# రక్షణ కోరుతున్న గ్రేట్ ఇండియన్ బస్టర్డ్

ఎగిరే పక్షులన్నింటిలోకి పెద్దది ఇండియన్ బస్టర్డ్. ఉష్ట్రి పక్షికి మల్లేనే ఎత్తుగా ధృడంగా వుంటుంది. ఎంతో అవసరమైతే తప్పించి ఎగరదు. కాని చాలా వేగంగా పరిగెత్తగలదు మీటరుకు పైగా ఎత్తు, 17 కిలోల వరకు బరువు వుండే బస్టర్డ్, రెక్కలు విప్పినపుడు 2.5 మీటర్ల వెడల్పు వుంటుంది.

మగపక్షి ఆడపక్షికన్నా పెద్దదిగా వుండటమేకాక తల మీద నల్లని కుచ్చులాంటి కిరీటం వుంటుంది. మిడుతలు, ఇతర కీటకాలు, తొండలు, చిన్న చిన్న పాములు ఈ పక్షుల ఆహారం. ఈ పక్షి జీవితకాలం ముప్పయి సంవత్సరాలు.

గుబురుగా గడ్డి పెరిగే మైదానాలు వీటి నివాస స్థానాలు, వర్షపాతం తక్కువగా వుండే ప్రాంతాలు, ముఖ్యంగా ఎడారులలో బస్టర్డ్ కన్పిస్తుంది. నాలుగు, అయిదు వందల సంవత్సరాల క్రితం బస్టర్డ్ భారతదేశంలో విస్తృతంగా కనిపించేవి. కాని ప్రస్తుతం రాజస్థాన్, గుజరాత్, మహారాష్ట్రి, మధ్య ప్రదేశ్, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రిలలో మాత్రమే కనిపిస్తున్నది.

## కవితలు

ఈ తరం కవితలు
చీకటిని చీల్చే
వెలుగు కత్తులు !
ప్రేమని వెలిగించే
వలపు వత్తులు !

— ఆచార్యభావన్




సంతానోత్పత్తి కాలంలో మగ పక్షికి మెడక్రింద ఒక తిత్తిలాంటిది కనిపిస్తుంది. ఆ తిత్తిని ఉబ్బినట్టుచేసి ఇతర మగ పక్షులను భయపెడుతుంది. ఆడపక్షులను ఆకర్షించేందుకు మగపక్షి సంగీతం పాడుతూ నృత్యం చేస్తుంది. ఆ చేష్టలకు ఆకర్షింపబడిన మూడు, నాలుగు ఆడ పక్షులతో జంటకడుతుంది మగ బస్టర్డ్.

ఫిబ్రవరి, మార్చి నెలల్లో ఆడపక్షి ఒకే ఒక్కగుడ్డు పెడుతుంది. ఆడ మగ పక్షులు రెండు గుడ్డుని పొదుగుతాయి. ముప్పయి రోజులలో బస్టర్డ్ పిల్ల బయటకొస్తుంది.

ఇటువంటి ప్రత్యేకతలు కలిగిన బస్టర్డ్ పక్షికి ఇప్పుడు రక్షణ అవసరమైంది. రాజ సంస్థానాల కాలంలో బస్టర్డ్ పక్షులను వేటాడడం ఒక సరదాగా భావించేవారు. ఈ పక్షి మాంసం ఎంతో రుచిగా వుండడం వలన ఈ పక్షిని అధిక సంఖ్యలో చంపటం మొదలుపెట్టారు.

ఈ పక్షిని రాజస్థాన్ రాష్ట్రిపక్షిగా ప్రకటించింది. దీని రక్షిత నివాసంగా జైసల్మేర్ జిల్లాలో ప్రత్యేకంగా ఒక ఎడారి పార్కుని నిర్మించారు

— డా॥ దుగ్గరాజు శ్రీనివాసరావు



# త్యాగం వలన అధికారం అర్హతలు ప్రాప్తిస్తాయి

త్యాగం వలన అధికారం, అర్హతలు ప్రాప్తిస్తాయి. మీ కుటుంబాల బాధ్యతలను వదలమని నేను చెప్పడంలేదు. కాని కొంతవరకైనా త్యాగం అవసరం. ఇది సాయికి కాదు. సంఘానికి కాదు. ఇది నీ కొరకే అని గుర్తించాలి. ఇతరులను అనుసరింపక మన శక్త్యానుసారం కార్యక్రమాలు జరుపుకోవాలి. అనుకరణ ( Imitation ) బలహీనత. Quantity కాదు ముఖ్యం. Quality ప్రధానం. దీనికి స్వార్థ త్యాగం అవసరం.

శ్రీ సత్యసాయి బాబా

## Art, Heart

గ్రామసేవ మన లక్ష్యం. ఇంకా అనేక గ్రామాలకు మనం వెళ్ళవలసి వున్నది. చేబట్టిన గ్రామాలను మొట్ట మొదట పూర్తిచేయాలి. తరువాత మరొక గ్రామానికి వెళ్ళాలి. ఇది మనం ఎవరినీ ఆకర్షించుటకు చేసే Art కాదు మన సేవ Heart నుండి వచ్చేది. Art is External, Heart is Internal. అప్పుడే Self Satisfaction ( ఆత్మ సంతృప్తి ) వుంటుంది. చెప్పేది చెయ్యాలి. చేసింది చెప్పాలి. చెయ్యంది చెప్పరాదు.

## సేవ

ఈనాడు మనం అనేక సేవలను అందించుచున్నాము. ఇది ఎవరి కొరకు. ఈ సేవలన్నియు మన నిమిత్తమే అని గమనించాలి. సేవకు ప్రధానం మూడు వుండాలి. 1. అధికారము ( హక్కు ) ( Right ) 2. అర్హత (విధి లేక కర్తవ్యము) ( Responsibility ) ఈ రెండు లేకపోతే ఆశించినది ఒకటి అయితే ఫలితం వేరొక రీతిగా వుంటుంది. ఇక మూడవది శక్తి సామర్థ్యములు. సమస్యలను గుర్తించి తన్నివారణార్థమై పరిష్కారముల నందించునదియే శక్తి సామర్థ్యములు. అనాడే అధికారము నకు ( హక్కు ) అవకాశ ముంటుంది. సేవ అంటే ఏమి ? కర్మ చిత్తశుద్ధిని అందించాలి. ఇతరులకు కాదు. కనుకనే " చిత్తశుద్ధియే కర్మ " అన్నారు. సేవా భావము యొక్క అంతరార్థమును గుర్తించి హృదయము నకు హత్తుకొనేలాగ బోధించి ఇతరులకు వివరించినప్పుడే ఆ అర్హత వస్తుంది. కొందరు దీనికి విరుద్ధంగా ప్రవర్తించడం వలన వాదోపవాదములకు దారితీస్తున్నది. ఉపన్యాసములు చేయనవసరంలేదు. కనీసం ఒకటైనా ఆచరించి చూపించాలి. మాటలు, మార్గములు నిష్ప్రయోజనములు. సాధనలు కూడను నిరర్థకములు. కేవలం ఆచరణయే ప్రధానం. అప్పుడే కార్యకర్తలకు అర్హత వస్తుంది. కొందరు బజారు ఊడ్చడం, బావులు త్రవ్వడం మొదలైన సేవలు చేయుచున్నారు. ' ఎందు కొరకు ' అని ప్రశ్నించినప్పుడు " పైనుండి Order వచ్చినది " అని సమాధానం చెబుతుంటారు. ఈ సమాధానం వలన ప్రయోజనంలేదు. ఎవరు ఏ విధంగా ప్రశ్నించినా సరైన సమాధానం చెప్పే సామర్థ్యమును సంపాదించుకోవాలి. మనము Hard Workers ను అభినందించుచునే యున్నాము. కాని డబ్బు తీసుకొని Hard-Work చేసే వారు కూడా సమాజంలో వున్నారు గదా ! కాని మనది నిస్వార్థసేవ. ఈ సేవ ఆకర్షణ, అందము, ఆనందము, ఆదర్శము నందించాలి. కొందరు "ఇతరులు ఏమనుకున్నా నా Work నేను చేస్తున్నాను ", అని భావిస్తున్నారు. ఇది చాలా తప్పు. ఇతరులను మనం గమనించాలి. స్వామిని లక్షలాదిమంది గమనిస్తునే వున్నారు. మన

సంస్థలను గమనిస్తునే వున్నారు. ఇతరులు గమనించుట లేదని భావించుట పొరపాటు.

## ఆచరించాలి

ఆచరించినప్పుడే అర్హత వస్తుంది. ఆచరణ ద్వారా ఇతరులకు బోధించాలి. మానవాభ్యుదయ శిక్షణను ముందు మనం పొందాలి. అది లేకున్న ప్రయోజనం వుండదు. మానవాభ్యుదయ శిక్షణలోని సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింస పదములను గ్రామఫోన్ ప్లేటువలె వల్లెవేసినంత మాత్రమున ప్రయోజనముండదు. ఇది చాలా ప్రమాదం. మనస్సు కంప్యూటర్ వంటిది. సరైన స్థితిలో వున్నప్పుడు ఈ కంప్యూటర్ సరియైన ఫలితాలను అందిస్తుంది. చెడిపోయినప్పుడు దుష్ఫలితాలను యిస్తుంది. కనుక మానవుడు ఈ విషయమును గుర్తించి, ఆచరించి బోధించాలి. సత్యమును బోధించునప్పుడు బాగా యోచించి బోధించే సామర్థ్యమును పెంచుకోవాలి.

## సర్వమత సమ్మతం

ప్రేమను గురించి కేవలం బోధించుట వలన ప్రయోజనం లేదు. మనం Teachers అనుకుంటున్నాం. కాని మనం ఎల్లప్పుడూ విద్యార్థులమే. కనుక మనం మొదట మానవాభ్యుదయ శిక్షణ ( E. H. V. ) ను మన సంస్థలవారికి అందించాలి. అప్పుడు ఇతరులకు అందించే అర్హత వారికి వస్తుంది. మన దగ్గరికి భిన్న మతముల వారు వస్తుంటారు. కొంతమంది కార్యకర్తలు కఠినంగా జవాబు చెబుతుంటారు. ఇది చాలా తప్పు. మృదు మధురంగా మాట్లాడటం నేర్చుకోవాలి. ఎవ్వరిని బాధించక, నొప్పించక సర్వమత సమ్మతమే సాయి అభిమతమని, ఇదియే సాయి మతమని చాటిచెప్పే ధైర్య సాహసములను అలవరచుకోవాలి. సాయికి పేరుతో పనిలేదు, నిమిత్తంలేదు. ఈనాడు సమాజంలో టన్నుల కొద్ది ఉపన్యాసాలిస్తూ కాలక్షేపం చేస్తున్నారు. ఒక్క ఔన్సు అయినా ఆచరణలో పెట్టడంలేదు. ఇది మారాలి. ఆచరించి బోధించడం నేర్చుకోవాలి.

బాబా... సాయిబాబా...
శ్రీ సత్యసాయిబాబా...

ఏ పూర్వ పుణ్యమో
ఏనాటి బంధమో
కలిపింది నన్ను
నీతో కలిసింది హృదయం...

నీవు చూపే కరుణకు
కరిగేను మనసు
నీవు చెప్పేమాట
కోటి వరహాల మూట...

నీవు చూపిన ప్రేమకు
పులకించె హృదయం
నీవు పెట్టిన విభూతి
భక్తులకు శ్రీరామ రక్ష...

నీ నిండు ఆదరం
కలిగించు ఆనందం
నీవు యిచ్చే ప్రసాదం
పెంచేను విశ్వాసం...

నీవు యిచ్చిన సందేశం
భావి తరాలకు ఆదేశం
నీవు చూపిన మార్గం
మా పాలిటి జ్ఞాన దీపం ...

సత్యం, ధర్మం
శాంతి, ప్రేమ !
సాయి సందేశం !
వినిపిస్తానిక సాయి సందేశం...

— కొమరగిరి

## స్వశక్తి

ముందుగా మన లోపాలను గ్రహించాలి. అప్పుడే సంస్థలు అభివృద్ధి చెందుతాయి. మనం ప్రభుత్వంమీదనే ఆధారపడరాదు. మనం ప్రభుత్వంతో కాదు రిజిష్టర్ చేసుకోవాల్సింది. ప్రేమతో రిజిష్టర్ చేసుకోవాలి. మనం ప్రభుత్వ ధనంతో ప్రమేయం పెట్టుకోరాదు. ఆధారపడటం అధోగతికి చిహ్నం. ఈనాడు మనకు సహకరించు మంత్రులు, ప్రభుత్వోద్యోగులు వుండవచ్చును. రేపటి దినం మార్పులు వచ్చినప్పుడు కార్యక్రమము లన్నియు నిలిచిపోతాయి. కనుక మనం "స్వశక్తి" పైననే ఆధారపడాలి. ముందు ఐక్యతను అభివృద్ధిపరచుకొని సేవలో ప్రవేశించాలి. అప్పుడే మనకు అర్హత వస్తుంది. అన్నిటికి Unity అవసరం. ఈ Unity రావలెనని Purity అవసరం. అప్పుడే Divinity ని అనుభవించ గలం. అట్టి Unity లేకపోతే Enimity పెరుగుతుంది. ఈనాడు సమాజంలో Community భావాలు మితిమీరి పోతున్నాయి. మన సంస్థలలో వీనికి స్థానంలేదు. కార్యకర్తలు అర్హత, బాధ్యత, అధికారములను గుర్తించాలి. ఎల్లరికి స్పష్టముగా వివరించి తెలియజెప్పాలి. ముందుగా మన సంస్థల వారందరూ E H V (మానవాభ్యుదయ శిక్షణ) పొంది అన్నదమ్ములవలె కలిసి మెలిసి మెలగడం నేర్చుకోవాలి. అసూయకు అవకాశం యివ్వరాదు. ఇది చాలా చెడ్డది.

## ధర్మ

కర్మ చాలా ప్రధానమైనటు వంటిది. సనాతన ధర్మమునకు నాలుగు స్తంభాలు ప్రధానం కర్మ, జన్మ, ధర్మ, బ్రహ్మములు. కర్మయే జన్మమునకు కారణం. కార్యమునకు కారణమెట్టిదో, మొక్కకు విత్తన మెట్టిదో, జన్మకు కర్మ ఆధారమైనటు వంటిది. ఇట్టి జన్మ, ధర్మాచరణ నిమిత్తమై ఏర్పడినటువంటిది. అందుచేత "శరీరమాద్యంఖలు ధర్మ సాధనం" అన్నారు. ధర్మమే భగవంతుడు. కనుక తాను "ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అన్నాడు. కనుకనే రాముని "రామోవిగ్రహవాన్ ధర్మః" అన్నారు. ధర్మమును నిర్మూలించినప్పుడు అది మానవ వినాశమునకు దారి తీస్తుంది. అందుచేత ధర్మ దర్శనమే దైవ దర్శనము. కర్మ, జన్మ, ధర్మ, బ్రహ్మములకు ఒక చిన్న ఉదాహరణ. మొట్టమొదట బిడ్డ తల్లిని చూస్తుంది. ఆ తల్లి మాత్రమే తండ్రిని చూపుటకు అర్హురాలు. తండ్రి గురువును, ఆ గురువు దైవమును చూపుతారు.

## మానవుడు

మానవులు మూడు రకములు. 1. బుభుక్షువు 2. ముముక్షువు. 3. ముక్తుడు. జీవితము నిరర్థకము గావించుచు అన్నపానముల నాశ్రయించి, దేహ సంరక్షణార్థమై యావజ్జీవితము బంధితుడై ఖైదీగా జీవించు బుభుక్షువునకు ఆశల ఆశయాల ప్రయోజనముండదు. విశ్వాసరహితుడై, జిజ్ఞాసరహితుడై అధమ స్థాయిలో జీవిస్తాడు. మూడవవారు ముక్తులు. వీరు పెంచవలసిన దానిని పెంచుతారు. విశ్వసించవలసిన దానిని విశ్వశిస్తారు. చేరేటటువంటి ప్రదేశమునకు చేరుతారు. వీరికిని ఆశలు, ఆశయాల అవసరముండదు. ఇక రెండవ వారైన ముముక్షువులకు ఆశలు ఆశయాలు అత్యవసరం. వీరు ముక్తిని ఆశించువారు. దుఃఖ నివృత్తి, ఆనంద ప్రాప్తిని కోరునటువంటివారు. ఇట్టి ఆనందమునకు త్యాగము అవసరము. త్యాగమనగా "ఆలి ఆస్తిని వీడి అడవి కేగుట కాదు. మనసునందు తుచ్ఛవాంఛలు వీడుటే త్యాగము. అదియే యోగమగును." దుష్ట చింతనల నుండి, దుష్ట భావములనుండి, దుష్ట చర్యలనుండి దూరము కావాలి. ఈనాడు చాలామంది దుష్ట భావములను వీడుట లేదు.

## నిప్పుకోడి

నిప్పుకోడిని వేటకాడు వెంటాడుతాడు. తప్పించుకొను ప్రయత్నమున ఆ నిప్పుకోడి తన ముక్కును ఇసుకలో దూర్చి దాస్తుంది. అది తనను ఎవరూ గుర్తించుటలేదని భావిస్తుంది. తన పెద్దదైన దేహాన్ని విస్మరిస్తుంది.

తాను చూడటంలేదు గదా యని, తనను ఎవరూ చూడటం లేదని అనుకొంటుంది. ఇది చాలా మూర్ఖత్వం. దానిని వేటగాడు తప్పక గుర్తించి హతమారుస్తాడు. ఇదే రీతిగా మానవుడు తన దోషాలను ఎవ్వరూ గుర్తించటంలేదని భావించినప్పటికినీ తాను దాచలేడు. మానవుని దోషాలు అతని ముఖమునందే ప్రతిబింబించుతూ వుంటాయి. మంచి చెడులను ముఖము ప్రకటిస్తుంది. ఇది ఒక Notice Board లాంటిది. మనము ఏది చెప్పినప్పటికిని ప్రజలు గుర్తిస్తారు. ఇట్టి ముఖము గ్రామఫోన్ ప్లేటు లాంటిది. దీనిలో విషయాలు కనిపించకపోయినా వినిపిస్తాయి. అట్లే ముఖమున భావాలు వినిపించకపోయినా కనిపిస్తాయి. కనుక దుష్ట భావములను దాచలేము. పవిత్ర భావములను అభివృద్ధిపరచుకోవాలి. అప్పుడే దివ్యమైన, భవ్యమైన, నవ్యమైన భావాలు వచ్చుటకు అవకాశ ముంటుంది.

## అహంకార మమకారాలు

బియ్యముపైన పొట్టు వున్న వడ్ల గింజలను మనం భుజించలేం. మొదట పొట్టును దూరం చేయాలి. అప్పుడు భుజించాలి. అట్లే అభిమాన మమకారములను పొట్టు వున్నంత కాలం నీవు ఆనందమును అనుభవించుటకు వీలులేదు. వీనిని 'సేవ' ద్వారా పోగొట్టుకొని ప్రయత్నం చేయాలి. అహంకార రహితములైన పవిత్ర భావములను అభివృద్ధి గావించుకోవాలి. ఈ అహంకార మమకారము లను పొట్టును దాచినప్పుడు, అది తప్పక మొలకలుగా పెరగక తప్పదు. కనుక అహంకార మమకారములను తప్పనిసరిగా పోగొట్టుకొను ప్రయత్నం చేయడం ప్రధానం.

## నామ పవిత్రత

నామ పవిత్రత చాలా గొప్పది. హనుమాన్ సాగర సేతుబంధనమున వేసినవి వట్టి రాళ్ళని భావించరాదు. అవి రాళ్ళేయని వేసి వుండిన యెడల అవి మునిగిపోయి వుండేవి. కాని రామనామ పవిత్ర మంత్రముచేత అవి తేలికై మునగకుండా పైకి లేచినవి. ఇది నామము

## గ్రహణ శ:

విత రణ గుణశీలియైన గురువు
తర తమ భేదాల్లేకుండానే బోధిస్తాడు.
అయితే శిష్యులంతా
బింబగ్రహణ శక్తిగల మణులు కాలేరు.
రాయి రప్పల్లాగే మిగిలిపోతారు కొందరు!
— రమల్.

యొక్క పవిత్రత, గొప్పతనం. కనుక నామ సంకీర్తన మహిమను సర్వులూ గ్రహించాలి. ఈనాడు ప్రశాంతి నిలయంలోని భజనలను సైతము పలు దేశాలవారు అనుసరిస్తున్నారు. 68 దేశాలవారు మనపైపు చూస్తున్నారు. కనుక మనం మరింత ఆదర్శవంతమైన జీవితాలను గడపాలి. మనలోని దోషాలను సరిదిద్దుకోవాలి. గురుతరమైన బాధ్యత మనమీద వున్నది. ఈనాడు గురుపూర్ణిమ. షోడశ కళలతో సంపూర్ణ ప్రకాశమును చంద్రుడు అందిస్తాడు. ఈ చంద్రుడు మనకు అధిష్టాన దేవత. కనుకనే "చంద్రమా మనసా జాతః" అన్నారు. మనలో కూడా సంపూర్ణ మనోభావాలు ప్రకాశించాలి. మానవుడు పూర్ణ మానవుడై పరిపూర్ణ దివ్యత్వమును ప్రకాశించాలి. దీనికి విశాల హృదయం చాలా అవసరం. సర్వసాధనల సారము, సకల శాస్త్రముల మూలము, సర్వ ధర్మముల ధర్మము, విశాల హృదయము. ఆనాడే పరిపూర్ణ మానవత్వముంటుంది.

ది 21-7-1986 గురుపూర్ణిమ సందర్భమున వివిధ రాష్ట్ర అధ్యక్షులు, ట్రస్టు కన్వీనర్లు, సెంట్రల్ ట్రస్టు సభ్యుల సమావేశంలో భగవాన్ శ్రీ సత్యసాయిబాబాగారు చేసిన ఉపన్యాసం. ఈ సమావేశంలో పాల్గొనే మహద్భాగ్యం నాకు కలిపించినందుకు బాబాగారికి నా మనఃపూర్వకమైన కృతజ్ఞతాభివందనలు. — సం.

# ★ హనీమూన్ రాజధాని ★

నయాగరా ఫాల్స్ చూడటానికి కేవలం టూరిస్టులు మాత్రమే కాదు. కొత్తగా పెళ్ళయిన దంపతులు విహారయాత్రకి వెళ్తారు. దాన్ని ' హనీమూన్ కేపిటల్ ఆఫ్ ది వరల్డ్ 'గా కూడా వ్యవహరిస్తారు. అధికశాతం అమెరికా, కెనడాలనుంచి వెళ్ళినా, ఇండియా, జపాన్, ఇంగ్లండ్, ఆస్ట్రేలియా, జర్మనీ, ఫ్రాన్స్, స్విట్జర్లేండ్, రష్యా మొదలయిన దేశాలనుంచి కొన్ని వేలమంది దంపతులు నయాగరా ఫాల్స్‌కి వెళ్తుంటారు. దాదాపు వంద సంవత్సరాలనుంచి అది కొత్త దంపతులని ఆకర్షిస్తోంది.

## మనకు తెలియని ప్రపంచం

మల్లాది వెంకటకృష్ణమూర్తి

ఎక్కువగా మే, జూన్‌లలో వస్తుంటారు. గడ్డకట్టుకుపోయే చలికాలంలో, డిసెంబర్‌లో కూడా వందమందికి తక్కువ కాకుండా వస్తుంటారు. డిసెంబర్ 31 లోగా వివాహం చేసుకుంటే ఆదాయపు పన్ను ఆ సంవత్సరానికి తగ్గుతుంది. ఆదాయపు పన్ను ఆ సంవత్సరానికి తగ్గుతుంది కాబట్టి అప్పుడు కూడా వస్తారు.

చాలామంది దంపతులు చిన్నవాళ్ళే అయినా, ముసలివాళ్ళు కూడా వస్తుంటారు. 82 ఏళ్ళ వయసుగల ముసలాయన ప్రతి సంవత్సరం 86 ఏళ్ళ వయసుగల తన భార్యతో వస్తుంటాడు.

' విజిటర్ అండ్ కన్వెన్షన్ బ్యూరో ' అనే సంస్థకి ముందర అప్లికేషన్ పెట్టుకుంటే సావనీర్, హనీమూన్ సర్టిఫికేట్ ఇస్తారు. ఆ సర్టిఫికేట్ వల్ల హోటల్స్‌లో, భోజనం దగ్గర దంపతులకి సర్వీస్ త్వరగా లభిస్తుంది. కాలం వృధా చేయనవసరం లేదు.

నయాగరా ఫాల్స్ దగ్గరవున్న వూళ్ళో లక్షమంది ప్రజలున్నారు. వాళ్ళు 28 భాషలు మాట్లాడగలరు.

ఓసారి నయాగరా రెగినాల్డ్ ఫాల్స్ అనే యువకుడు తన భార్యతో హనీమూన్‌కి వచ్చాడు. అతని తల్లి తండ్రులు తమ హనీమూన్‌కి నయాగరా వచ్చినప్పుడు ఆ ప్రదేశం బాగా నచ్చటంతో ఆ ప్రదేశం పేరే పెట్టారు తమకొడుక్కి.

నయాగరా ఎత్తయిన జలపాతం. మామూలు యాత్రికుల కన్నా పెళ్ళయిన దంపతులు అక్కడ ఎక్కువ సరదాగా కాలక్షేపం చేస్తారు.

★★★

# ఆదర్శ రచయితా నీకు జోహార్లు! (కథ)

– జ్యోత్స్న

విశ్వం కథలు రాస్తాడు

చాలా బాగా రాస్తాడు.

అతని కథలెప్పుడూ   ల చుట్టూ,   సమస్యల చుట్టూ తిరిగి చాలా గొప్పగా వుంటాయి.

మా ఆఫీసులో ఆడాళ్ళు స్త్రీ జనోద్ధరణ కోసం కలం పట్టిన ఆదర్శమూర్తి అంటే, మగాళ్ళందరూ స్త్రీ పక్షపాతి అంటారు.

అసలు విశ్వం మా ఆఫీసుకి ట్రాన్స్‌ఫర్ అయి రాక ముందు నుండే ఆతని కథల్ని మెచ్చుకునేవాణ్ణి నేను.

నేనూ కథలు రాస్తాను. కానీ విశ్వం అంత గొప్పగా రాయలేను. ఎప్పుడో రాయాలనిపించినప్పుడు, సరదాగా రాస్తుంటాను. ఆ కథ ఓ పది పత్రికల చుట్టూ తిరిగి పదకొండో పత్రికలో అచ్చవుతుంది.

ఇద్దరమూ సాహిత్యాభిమానులం కనుక దగ్గర కావడానికి పెద్ద సమయం పట్టలేదు. ఆఫీస్ వదిలిన తరువాత ఏ పార్క్‌కో బీచ్‌కో పోయి కాసిన్ని సాహితీ కబుర్లాడుకుంటుంటాం.

ఓ రోజు విశ్వం నన్నడిగాడు. ‘మీ రెందుకు కథలు రాస్తారు? సమాజోద్ధరణ కోసమా లేక హాబీగానా?’ అంటూ.

నవ్వుతూ చెప్పాను ‘సమాజాన్ని ఉద్ధరించాలన్న ఆదర్శాలేం లేవు నాకు. మీలాగా రాయాలనుకున్నప్పుడల్లా కథలు రాయలేను నేను. ఏదో ఒక అనూహ్యమైన సంఘటన జరగాలి, లేదా హృదయాన్ని కదిలించేంత అద్భుత సౌందర్యం కనిపించాలి. ఇలా ఏదో ఒక బలీయమైన కారణంతో హృదయంలో స్పందన కలగాలి. అప్పుడు రాయాలనిపిస్తుంది, రాస్తుంటాను. నిజానికి అటువంటి సమయంలో రాయకుండా వుండలేను, అవి నా కోసం రాసుకునే రాతలు.”

విని పెద్దగా నవ్వేస్తూ–“మీకో ‘కమిట్‌మెంట్’ అంటూ లేదన్నమాట. ఎప్పుడు పడితే అప్పుడు ఏది కావలిస్తే అది రాసేస్తుంటారన్నమాట!” అన్నాడు.

అతడు నన్ను సరిగ్గా అర్థంచేసుకోలేదనిపించినా, విడమరచి చెప్పాలనిపించక మౌనం వహించాను.

“నేను మీలాగా ఏది కావలిస్తే అది రాయలేను సుమండీ! ప్రతి రచయితకు సామాజిక స్పృహ సామాజిక అవగాహన వుండాలి. ప్రస్తుత సమాజాన్ని పరిశీలించి, ఏది మంచో, ఏది చెడో? విశ్లేషించి చెప్పగలగాలి. తానేం చెపుతున్నాడో దాని కతడు కట్టుబడి వుండాలి. అంటే, ప్రతి రచయితకు ‘కమిట్‌మెంట్’ వుండాలన్న మాట. సమాజాన్ని పరిశీలించకుండా మీలా తోచినప్పుడల్లా ఏదో ఒకటి రాసేస్తే, ఆ రచనల్తో సమాజం పెడత్రోవ పట్టే ప్రమాదముంది తెలుసా?” అన్నాడు.

ఈమధ్య ప్రతి రచయితకు సామాజిక స్పృహ, సామాజిక అవగాహన వంటి పదాలను వాడడం ఒక అలవాటైపోయింది అనుకుంటూ “అలాగా” అన్నట్టు తలవూపాను.

“నా విషయమే తీసుకోండి, ప్రస్తుతం మన సమాజంలో స్త్రీ ఎలా పీడింపబడుతోందో, స్త్రీని ఎలా నాలుగు

గోడలమధ్య బంధించి బానిసగా చూస్తున్నారో....చిత్రించి చూపిస్తున్నాను. అంటే ఒక విధంగా ప్రస్తుత సమాజాన్ని నేను చిత్రిస్తున్నానన్న మాట” అన్నాడు మళ్ళీ.

ఎవరైనా తనగురించి తనే గొప్పగా చెప్పుకోడాన్ని నేను సహించను. ఆ గుణం విశ్వంలోకూడా వుందన్న విషయం ఆరోజు నాకు తెలిసింది.

“ఏఁవండోయ్ మూర్తిగారూ! ఇదేనండి మాయిల్లు” అని నా వెనుకనుండి కేక వినబడడంతో ఆలోచనల్తో నడుస్తున్న వాడినల్లా ఆగి, మనసులో తరంగాల్లా లేస్తున్న ఆలోచనలకు ఆనకట్టవేసి, వెనుదిరిగి చూశాను.

తన ఇంటి గుమ్మంలో నిలబడి నవ్వుతూ నావైపు చూస్తున్నాడు విశ్వం. నా మతిమరుపును తిట్టుకుంటూ అతనివైపు నడిచాను.

నిన్న ఆఫీసులో విశ్వం—“కొత్తగా ఓ కథ రాశానండీ. అది మీకు చదివి వినిపిద్దాఁవనుకుంటున్నాను, రేపెలాగూ ఆదివారంకదా! మీరు సాయంత్రం ఓసారి మాయింటికి రాకూడదూ?” అంటూ ఆహ్వానించాడు.

అలాగేనని అంగీకరించడంతో, తన యింటి అడ్రస్ చెప్పి ఎదురుచూస్తుంటానన్నాడు.

ఇవాళ అతని యింటికే బయల్దేరి, ఆలోచనల ప్రవాహంలో కొట్టుకుపోతుంటే, గుమ్మంలోనే నాకోసం ఎదురు చూస్తున్నట్లున్నాడు, పిలిచాడు. లేకుంటే యిల్లుదాటి యింకొంత దూరం వెళ్ళిపోయేవాడ్నే!

ఇద్దరమూ యింట్లోకి నడుస్తుండగా ఓ ఆరేళ్ళపాప ఎదురయింది.

“మా పెదపాప మాధురి” అంటూ పరిచయం చేసి “మధూ! అమ్మకు చెప్పి రెండు కప్పుల కాఫీ తీసుకు రామ్మా”! అన్నాడు.

“ఇపుడు అలాంటి ఏర్పాట్లేవీ చెయ్యకండి! ఇప్పుడే హోటల్లో తాగివస్తున్నాను” అన్నాను మొహమాటంగా.

‘ఫరవాలేదు! రండి! — ఇలా ఈ రూమ్‌లో కూర్చుందాం!’ అంటూ ఓ గదిలోనికి నడిచాడు. అతని వెనుకే నేనూ నడిచాను.

అది రీడింగ్‌రూమ్ కమ్ విజిటర్స్ రూమ్‌లా వుంది. ఆల్మైరానిండా పేర్చిన పుస్తకాలు, ఓ మూల రాసుకునే టేబుల్, పొందిగ్గా సర్దిన కుర్చీల మధ్యనున్న టీపాయ్ మీద కొన్ని పత్రికలు.

ఇద్దరమూ చెరో కుర్చీలో కూర్చున్నాం.

కాసేపు కబుర్లాడుకున్న తరువాత, ఇంతకుముందు హాల్లో కనిపించిన పాప ట్రేలో యిద్దరికీ రెండు కప్పుల కాఫీతో చాలా జాగ్రత్తగా నడుస్తూ వచ్చింది.

కాఫీ విశ్వం సతీమణి తీసుకొస్తే, అతడామెను పరిచయం చేస్తాడేమో, అనుకున్నాను. ఏమో! లోపల ఆవిడ ఏదో పనిమీద వున్నారేమో! అనుకుంటూ కాఫీ అందుకుని—

‘ఏం చదువుతున్నావు పాపా?’ అనడిగాను.

‘కె. జి. టు’ అంది.

“గుడ్!” నవ్వుతూ బుగ్గగిల్లి కాఫీ తీసుకున్నాను. ఖాళీ ట్రే పట్టుకుని యింట్లోకి వెళ్ళిపోయింది.

కాఫీలు తాగడం ముగిసిన తరువాత ‘కథ వింటారా?’ అన్నాడు టేబుల్ సొరుగులోంచి కాగితాలు తీస్తూ.

అలాగేనన్నట్లు తలూపాను.

విశ్వం కథ చదవడం ప్రారంభించాడు.

పావుగంట తరువాత కథ పూర్తయింది.

ఎలా వుందన్నట్టు నావైపు చూశాడు.

క్లుప్తంగా ఆ కథ సారాంశం ఇది—

మధ్య తరగతి కుటుంబంలో ఓ పద్దెనిమిదేళ్ళ అందమైన అమ్మాయి. పెళ్ళి మీద, తొలిరేయి మీద చాలా అందమైన ఆశల్ని సున్నితంగా పెంచుకుంటుంది. తరువాత పెళ్ళయి తొలిరేయినాడు భర్త ఎక్కువగా చదువుకున్నవాడు, ఈమె ఊహించినంత సంస్కారి కాకపోవడంతో, చాలా మోటుగా, దారుణంగా (ఆమె భాషలో) ఆమె ఊహలకీ ఆశలకీ భిన్నంగా ప్రవర్తిస్తాడు. దాంతో ఆమె తన జీవితం నాశనమయిందని చాలా బాధపడి కృంగిపోతుంది. ఈ 'పవిత్ర భారతదేశంలో ఇటువంటి జీవచ్ఛవపు ‘బ్రతుకు లెన్నో?’ అన్న వాక్యంతో ముగించేశాడు కథని.

అందులో అతడేం చెప్పదలచుకున్నాడో నాకేం అర్థం కాలేదు. 'పెళ్ళిళ్ళు వధూవరుల యిష్టాలమీద కాక, పెద్దల ఇష్టానుసారం జరిగితే ఇలాగే వుంటాయని చెప్పదలచుకున్నాడు కాబోలు' అనుకున్నాను.

"సమస్యను సమస్యగానే వదిలేసినట్టుంది" అన్నాను నా అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ.

"అంతేనండీ! పెళ్ళికిముందే ఒకరిగురించొకరు బాగా తెలుసుకోవాలి, ఈ సమస్యకు అదే పరిష్కార మార్గం!' అన్నాడు విశ్వం.

'అలాగా! అయితే కథ బాగుంది' అన్నాను.

ఇంకాసేపు కబుర్లు చెప్పుకున్న తరువాత, 'ఇంక నే వెళతానండీ!' అంటూ లేచాను. రోడ్డు వరకూ వచ్చి సాగనంపాడు విశ్వం.

రోడ్డు మీద నడుస్తుంటే, ఎంత వద్దనుకున్నా నా ఆలోచనలు విశ్వం చుట్టూ తిరుగుతున్నాయి. ఇంటికి వచ్చిన అతిథికి తన భార్యను, కుటుంబ సభ్యులను పరిచయం చేయాలన్న కనీస సంస్కారం కూడా లేదా? స్త్రీ స్వాతంత్ర్యం గురించీ, స్త్రీ అభ్యుదయం గురించీ, అంతగా రాసే విశ్వం, తన భార్యను నాలుగు గోడల మధ్య వుంచేస్తున్నాడా....ఏమో! యిటువంటి పరిచయాలు అతని భార్యకు యిష్టం లేదేమో?

మనసులోని ఆలోచనలను పారద్రోలడానికి ఎదురుగా కనబడ్డ సినిమా థియేటర్‌వైపు నడిచాను.

## 2

ఉదయం నుండీ ఆకాశం ఏకధాటిగా ఏడుస్తోంది.

ఉదయం నుండీ ఎక్కడికీ వెళ్ళడానికి వీలుపడక ఈ ఆదివారాన్ని యింట్లోనే గడపాల్సొచ్చింది.

సమయం సాయంత్రం ఏడౌతోంది.

ఆకాశంనిండా దట్టంగా మబ్బులు అలముకోవడంతో అప్పుడే గాఢంగా చీకటి చోటుచేసుకుంది.

నల్ల దుప్పటికి చిన్న చిన్న చిరుగుల్లా అక్కడక్కడా వీధి దీపాలు మినుకు మినుకు మంటున్నాయి.



ఉదయంనుండీ ఎక్కడికీ కదలకపోవడంతో తనువూ మనసూ మొద్దుబారిపున్నాయి.

బయట చల్లని వాతావరణం శరీరాన్ని గిలిగింతలు పెడుతూ నరాలను తిమ్మిరెక్కిస్తోంది.

పెళ్ళిచేసుకోకుండా కాలాన్ని గడిపితే పోగొట్టుకునే దేమిటో ఇలాంటి వాతావరణంలోను, ఇటువంటి సమయాల్లోనూ తెలుస్తుంది.

మంచంమీద పడుకుని 'హెరాల్డ్ రాబిన్స్'ని చదువుతున్న వాడినల్లా లేచి గబగబా బట్టలు వేసుకున్నాను.

ఇటువంటి వాతావరణంలో క్షణాల్ని వృథాగా పోనీకుండా సుఖాన్ని కొనుక్కోవాలనుకుని——

గది తలుపులు మూసి, తాళంవేసి, రోడ్డు వారగా నడవసాగాను.

వర్షం శాంతించి చిన్న తుంపరగా మారింది.

ఎదురుగా కనిపిస్తున్న జంక్షన్ వరకూ నడిస్తే చాలు, అక్కడేదైనా రిక్షా దొరుకుతుంది.

# ఆహ్వాన గీతం

ప్రభంజనాల్లు ఆటూ ఇటూ విజృంభించినా
పర్వతాగ్రాలకూ బురద నేలలకూ తరలి పోతాను
ఎవరు తోడుగా వస్తారు ? ఎవరు ఆరోహిస్తారు ?
వాగులు దాటుతూ మంచులో ముందుకు సాగుతూ
వెంట ఎవరు వస్తారు ?
తలుపులూ గోడలూ నిర్బంధించే సంకుచిత నగరాల
పరిధిలో నివసించను నేను
నా శిరస్సు మీద నీల గగనంలో శ్యామసుందర
మూర్తి
నా మీదికి పెనుగాలులూ తుఫానులూ విరుచుకు
పడుతున్నాయి.
ఇక్కడ ఏకాంత సీమలో నాఖేలా విలాసం
ఆపదలే నాకు ఆప్త మిత్రులు.
ఎవరు నిరవధిక జీవనం కావాలంటారో
ఎవరు స్వేచ్ఛా జీవితం కోరుకుంటారో
వారంతా రావాలి
పవన ప్రకంపిత పర్వత సీమల్లో విహరించాలి
పర్వతాగ్రాల అధివసించే ప్రభంజన స్వామిని నేను
గర్వ గౌరవ విలసిత స్వేచ్ఛా ప్రబల శక్తిని నేను
నా సామ్రాజ్యంలో సహచరులై నాతో విహరించ
దలచిన వారందరూ
ప్రమాదాలకు ప్రియబాంధవులై దిగంబరులై
తరలి రావాలి మరి.

( శ్రీ అరవిందులు కారాగారంలో వున్న తరుణంలో స్వేచ్ఛనూ సాహసమునూ శ్లాఘిస్తూ వ్రాసిన అద్భుతమైన గీతం )

జంక్షన్ చేరి, రిక్షా ఎక్కి ఎక్కడికెళ్ళాలో వాడికి చెప్పాను. వాడు హుషారుగా ఈలవేస్తూ రిక్షా తొక్కుతున్నాడు.

నేను చేరాల్సిన 'సందు' దగ్గర రిక్షా ఆగింది. దిగాను. 'వచ్చేదాకా వుండమంటారా బాబూ ?' అంటూ రిక్షా వాడడిగాడు.

'వద్దు !' అని వాడి చేతిలో ఓ రెండు రూపాయల నోటు పెట్టి ముందుకు నడిచాను.

నాలుగు అడుగులు వేసిన నా కాళ్ళు హఠాత్తుగా ఆగిపోయాయి.

ఆశ్చర్యం ! జుగుప్స ! ! అసహ్యం ! !

ఎదురుగా కొంత దూరంలో ఓ యింటిముందు ఒక రిక్షా ఆగివుంది. అందులోంచి విశ్వం దిగాడు ! రిక్షా వాడికి డబ్బులిచ్చి తననీ తన డ్రస్ నీ ఓసారి చూసుకున్నాడు. కాలర్, క్రాపూ ఓసారి సర్దుకుని, హుషారుగా ఆ యింటి మెట్లెక్కుతున్నాడు.

ఈ వీధిలోని ఇళ్ళు, సుఖాన్ని అమ్మే దుకాణాలు ! !

స్త్రీ అభ్యుదయం గురించీ, స్త్రీ విముక్తి గురించీ అంత ఆదర్శవంతంగా కథలు రాసి, రచయితకు కమిట్‌మెంట్ వుండాలని అంత ఖచ్చితంగా వాదించే విశ్వం ! పెళ్ళయి, పెళ్ళాం పిల్లలూ వున్న విశ్వం ! ఇక్కడ ఇలా కనిపించడం నన్ను చాలా ఆశ్చర్యపరచింది ! తరువాత అసహ్యం వేసింది.

అతను కనిపించకుండా వుండి వుంటే—మరి కాసేపట్లో నేనూ ఈ వీధిలోని ఓ యింట్లో వుండేవాణ్ణి.

కాని, ఇపుడు ముందుకి వెళ్ళాలనిపించడంలేదు !

వెనుదిరిగాను.

'నాలాంటి' రచయితలూ, వారు రాసే రచనలూ, సమాజానికి ఎంతవరకూ ఉపయోగపడతాయో చెప్పలేను గాని—

విశ్వంరాసే ఆదర్శవంతమైన కథలూ, అందుకు భిన్నమైన అతని ప్రవర్తన, సమాజంపై ఎటువంటి ప్రభావాన్ని చూపుతాయో, ఊహించగలను.

ఆదర్శ రచయితా ! నీకు జోహార్లు !

# పుస్తకసమీక్ష

## సాలగ్రామ శాస్త్రమ్

రచయిత : శ్రీ కపిలవాయి లింగమూర్తి

" సాలగ్రామ శాస్త్రమ్ " రచయిత శ్రీ కపిలవాయి లింగమూర్తిగారు. సంస్కృత మూలం, తెలుగు వివరణతో వెలువడిన ఆర్ష మత గ్రంధం. సాలగ్రామ మంటే సర్వ శక్తి సంపన్నుడైన భగవంతుని శిలా రూప విశేషం ఈ శాస్త్ర గ్రంథంలో సాలగ్రామశిల యొక్క ఉత్పత్తి, వాటిలోని విభాగాలు, సాలగ్రామ పూజావిధానం సమగ్రంగా చర్చించ బడ్డాయి. ఈ శిలలు ప్రకృతి సిద్ధమైన హిమాలయాలలో లభిస్తాయి.

వేదకాల సంవేదితమైన ఆర్ష సంస్కృతిని రక్షించటానికి బాధ్యత దాల్చిన తిరుమల తిరుపతి దేవస్థానం వారు ఈ గ్రంధ ప్రకటనకు ఆర్థికంగా తోడ్పడ్డారు. ఆనాడు ఎఱ్ఱన్న శ్రీనాధాది కవులను వలె, ఈనాడు కూడా రెడ్డి ప్రభువులు శ్రీ లింగమూర్తి గారిని ఆదరించటం వారి పూర్వజన్మ కృత పుణ్య విశేషమే. (శ్రీ ఎఱ్ఱం బాలకృష్ణా రెడ్డి దంపతులకు ఈ కృతి అంకితం )

సాలగ్రామ పూజ యెందుకు చెయ్యాలి? ఈ సాలగ్రామ శిల, అనాది, అఖండము, ఆర్షము అయిన భారతీయ సాంస్కృతిక సమైక్య స్వరూపానికి చిహ్నం. అందుకే యెక్కడో హిమాలయాలలో పుట్టిన యీ శిలను, సాగర గర్భంలో పుట్టిన శంఖాన్ని ఒక చోట చేర్చి పూజించటం మన సంప్రదాయం. సేతుశీతాచల పర్యంతం ఒకటేననే భావన యిందులో స్థిరపడుతోంది. రాజకీయాల కంటే యీ సంప్రదాయాలే భారతీయులను ఏకం చేస్తున్నాయి.

సృష్టి స్థితి లయ కారకుడు ఈశ్వరుడేనని "జన్మాద్యస్యయతః" వంటి సూత్రాలలో భగవాన్ వ్యాసులవారు నిరూపించి ఉన్నారు. పరమేశ్వరుడు ఎట్లా ఉంటాడు? నీవు ఎట్లా భావిస్తే అట్లా ఉంటాడు. ఆయన సర్వవ్యాపకుడు, సర్వశక్తి మంతుడు. భగవంతుడు మన కెలా ప్రత్యక్ష మౌతాడు ? నీ మనస్సు ఏకాగ్రమై ఉండటం ప్రధానం. అందుకోసం భగవంతుడికి నామ రూపాలు కల్పింప బడ్డాయి. నీలో అజ్ఞానం నశించి, అద్వైత భావన కలగానే నీకు భగవంతుని రూపంతో అవసరం ఉండదు, అంత వరకు విగ్రహార్చన తప్పదు భగవంతుని మూర్తులు రెండు రకాలు. ఆయా దేవతలను ఆవాహన చేసి ప్రతిష్ఠ చేసిన మూర్తులు కొన్ని, ఆవాహన, ప్రతిష్ఠ లేకుండానే నిత్య దేవతా స్వరూపాలైన మూర్తులుకొన్ని. సాలగ్రామ శిలలు నిత్య దేవతా స్వరూపాలు. విష్ణు దేవతా స్థానాలు. కొన్నాళ్ళు పూజ వదలి వేసి, తర్వాత యెప్పుడో పూజ చేసినా ఆయా మూర్తులలో దేవతాత్వం తొలగి పోకుండా ఉండటమే యీ సాల గ్రామ శిలల ప్రత్యేకత. హిమాలయాలలో గండకీ నదిలో పుట్టిన విష్ణు స్వరూపాలయిన యీ సాలగ్రామ శిలలను, లక్ష్మీనృసింహ సాలగ్రామంగా ఆది శంకరులు అర్చించారు. బ్రహ్మసూత్ర భాష్యంలో వివరించారు. - సాలగ్రామం విష్ణువుకు ప్రతీకయే కాదు, సాక్షాద్విష్ణువే. సాలగ్రామ పూజ యెంత ఫలితాన్ని ఇస్తుందో, సాలగ్రామ దానం కూడా అంతే ఫలితాన్ని యిస్తుంది. సాలగ్రామ సమీపంలో శ్రాద్ధ కర్మ ద్విగుణీకృత ఫలితాన్ని ప్రసాదిస్తుంది.

నిర్ణయ సింధువు, ధర్మసింధువు, సాలగ్రామ పరీక్ష లక్షణము, సాలగ్రామ మాహాత్మ్యం, శివ, స్కంద, పద్మ, విష్ణు బ్రహ్మ వైవర్త, వరాహ, మత్స్య, మేరు తంత్రాది వివిధ పురాణాది గ్రంధాలను పరిశీలించి ప్రసన్నమైన తెలుగులో శ్రీ లింగమూర్తిగారు సాలగ్రామ శిలా విశేషాలనుసమకూర్చారు. హేతువాదాన్ని పరాస్తంచేసే ప్రకృతి విశేషాలను లింగమూర్తిగారు వివరించారు. సృష్టిలోని అద్భుతాలు, ఆధునిక విజ్ఞాన శాస్త్రానికి అందనివి అనేకం ఉన్నాయి. సాలగ్రామం లోపలి భాగం పరిశీలించితే అందులో " చక్ర " చిహ్నం ఉంటుంది. ఈ చక్రాన్ని

( తరువాయి 28 వ పేజీలో )

# భావసమాస రచనా శిల్పి - శ్రీకృష్ణశాస్త్రి

కవి –

కాళిదాసు కవి –

కృష్ణశాస్త్రి మహాకవి–చిత్రంగాలేదూ?!"

ఒకనాటి సన్మాన సభలో ఎవరో తనను మహాకవి అన్నప్పుడు, కృష్ణశాస్త్రిగారు ఈ విధంగా ఎదురు ప్రశ్న వేసారు. కృష్ణశాస్త్రి గారి వంటి లబ్ధప్రతిష్ఠులైన కవి ఎంత గంభీరంగానో నిండుగా హుందాగా సమాధానం ఇవ్వాలో, అంత హుందాగాను, గంభీరంగాను, నిండుగాను సమాధానం ఇచ్చారు.

## ధూర్జటి వేంకటబాలా

దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారుగా లోకంలో పుట్టిన భావకవి కృష్టశాస్త్రిగారు– సినీ కవిగా యావదాంధ్ర ప్రజలకు–

భావకవిగా లబ్ధప్రతిష్ఠులైన మిగిలిన సాహితీపరులకు–

భావకవితా చార్యునిగా మిగిలిన యువకులకు–

కృష్ణశాస్త్రిగారుగా– తెలుగు దేశానికి సుపరిచితులు.

ఆయన చేపట్టని సాహితీ ప్రక్రియలేదు. దాదాపుగా ఆధునికాంధ్ర సాహిత్యంలోని ప్రక్రియలన్నింటిలోనూ, ఆయన తనదైన ముద్రవేశారు. కథలురాశారు. నాటకాలు రాశారు. నాటికలురాశారు. నృత్యనాటికలురాశారు. ( క్షీర సాగర మథనం) , కావ్యాలు - విమర్శలు - పద్యకావ్యాలు, ఖండకావ్యాలు, భావ గీతాలు, లలితగేయాలు– ఇలాంటివి ఎన్నో ఆయన లేఖినినుండి జాలువారాయి.

భావకవిత్వంలో పద్యకవిత్వానికి ప్రాణం పోసారు. ఆండాళు, తిరుప్పావై, ధనుర్దాసు వంటి ఉత్కృష్ఠ రచనలు గావించారు. ఇంకా ' విద్యాపతి ' అనే నాటకాన్ని తలచుకొన్నప్పుడు తెలుగు సాహితీ ప్రపంచంగాని తెలుగు జాతిగాని, కృష్ణశాస్త్రిగారి ప్రతిభను మరచిపోదు. దాన్ని ఒక సర్వాంగ సుందర దృశ్యకావ్యంగా తీర్చిదిద్దారు.

కానీ–

కృష్టశాస్త్రిగారు కేవలం పాటకోసమే పుట్టినట్టుగా, పాటనే రచించి, మైమరపించి అపర గేయచక్రవర్తి అయ్యారు.

ఆయన రాసిన సినిమా పాటలుగానివ్వండి– లలిత గేయాలు కానివ్వండి– భావగీతాలు కానివ్వండి– ప్రతిరచనలోనూ తన దంటూ ఒక బలమైన ముద్రవేసారు. గేయ రచనలో తనదంటూ ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నారు.

దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రిగారని, ఆయనకు పేరు రావడానికి కారణం ఆయన తండ్రిగారి పేరుకూడా దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి. ఆయనకు కృష్ణశాస్త్రి అనే పేరుకంటే దేవులపల్లి తమ్మన్నశాస్త్రిగారు గానే గుర్తింపు ఉండేది. దేవులపల్లి సోదరులుగా కీర్తింపబడిన కృష్ణశాస్త్రి గారి పెద తండ్రిగారి పేరు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి గారు ఆయన తమ్ముడు దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రిగారు. తమ్మన్న అంటే తమ్ముడు అనే అర్థంలో ఆ పేరుపెట్టి యుండవచ్చు అదే బాగా ప్రసిద్ధమైంది.

వీళ్ళిద్దరు ఆరోజులలో పిఠాపురం జమీందారుగారి దగ్గర వారి ఆస్థానంలో కవులుగా, పండితులుగా ఉండేవారు. కృష్ణశాస్త్రిగారు కూడా చిన్ననాటి నుండి కవి, పండిత గోష్ఠులలో పాల్గొంటూ కవిత్వం పట్ల తగిన ఆసక్తిని పెంచుకొని, జన్మాంతర సంస్కారం వల్ల అబ్బిన కవితా పరిమళంతో, ఆయన భావ కవిత్వాన్ని రచించి లోకానికి అందించారు. ప్రాచీన సంప్రదాయ బలంతో ఆంగ్ల సాహితీ సంపర్కంతో–ఈ రెండింటి సమ్యక్సమ్మేళనంతో ఆయన ఒక వింత రసాయనాన్ని తయారు

గావించి– దాంతో కవిత్వాన్ని రచించి అందులో తన ప్రత్యేకతను నిలుపుకొన్నారు.

భావకవిత్వాన్ని రచించే ఒకానొక అధునాతన భావ కవిని గురించి కృష్ణశాస్త్రిగారు-

" మెఱుగు కళ్ళజోడు, గిరజాలు సరదాలు
భావ కవికి లేనివేవి లేవు
కవితయందుఁ దప్ప గట్టి వాడన్నింట
విశ్వదాభిరామ వినురవేమ "

- అని వ్యంగ్యంగా చమత్కార పూర్వకంగా పలికారు. అయినప్పటికినీ ఆయన భావకవులకు ఆచార్యుడే ! ఆయన రాసిన కావ్యాలలో ఊర్వశి, ప్రవాసం, కృష్ణ పక్షం; వంటివి ప్రధానంగా పేర్కొన దగ్గవి. తన ఊర్వశి కావ్యంలో ఒకచోట తాను సృష్టించుకొన్న ప్రేయసియైన ఊర్వశిని గురించి–

" నేడు నాజీవితము కూడ నిర్జరాంగ
నాదరస్మితమయి ప్రపంచాల ప్రాకు
పిలుచు నీరేడు లోకాల ప్రేమ కొఱకు
పరపు నాహృదయము చరాచరములకును "

– అని అభివర్ణిస్తారు మోడువారిన జీవితం ఒక్కసారి నందనోద్యానం కావడానికి. కేవలం ప్రేమించిన "ప్రేయసి" ఊర్వశేనన్న విషయం తన పద్యంలో ప్రతి పాదిస్తారు. ఊర్వశి కూడా తాను ప్రేమించిన ప్రియుని గురించి ఈ విధంగా తలపోస్తుంది.

" ప్రియతమా ! దాసి యక్షయ ప్రేమ సేవ
కీ లతాంతాల మొత్తాలు చాలునోయి
నింగి మూలలే నీలి పందిళ్ళు పరచి
యెంత తెలి మల్లెతోట వేయించినావో "

– ఇది ఒక మధురమైన భావన కదూ ! " కృష్ణ శాస్త్రిగారి బాధ. ప్రపంచానికి బాధ, ప్రపంచం బాధ శ్రీశ్రీ బాధ " అని శ్రీశ్రీ గారి మహాప్రస్థానానికి పీఠికను రాస్తూ, చలంగారు అనడానికికూడా కారణం కృష్ణశాస్త్రి గారి ఆత్మాశ్రయ కవిత్వమే !

భావ కవులకు ప్రేయసి-ప్రణయం వంటి అంశాలు రెండూ రెండు ఆరాధ్య దేవతలు. ప్రేయసీ ప్రియుల మధ్య వుండే ప్రేమానురాగాలను చిత్రించడం, ఒక ఊహా ప్రేయసిని సృష్టించుకోడం, ఆమెకోసం కవిత్వం రాసి పరితపించిపోవడం, భావకవులందరికీ ఒక తప్పని సరైన అలవాటైంది. భావకవులు సృష్టించిన ఊహా ప్రేయసులలో కృష్ణశాస్త్రిగారి ఊర్వశి, విశ్వనాథవారి 'కిన్నెరసాని', నాయనివారి 'వత్సల', తల్లావఝ్ఝలవారి 'హృదయేశ్వరి' వంటివారు ముఖ్యులు.

కృష్ణశాస్త్రిగారు కేవలం కవిత్వంవరకే పరిమితం కాలేదు. ఆయన రచించిన పాటల్లో ముఖ్యంగా భావగీతాలలో——

" ఆకులో ఆకునై పూవులో పూవునై
ఈ అడవిలో దాగిపోనా...ఇచటనే ఒదిగిపోనా..."

" సీతవేళ రానీయకు
శిశిరానికి చోటీయకు.... "

" వేయబోవని తలుపు
తీయమంటూ పిలుపు
రాధకెందుకు నవ్వు గొలుపు.... "

– వంటి పల్లవులను ( చరణాలను ) పరిశీలిస్తే కృష్ణశాస్త్రిగారు కేవలం గేయాలు, పాటల కొఱకు పుట్టినట్టుగా తోస్తుంది. ఆయన పాటలలో విశేషం—— భావాలతో సమాసాలు కట్టడం. ఏ కవి కూడా భావాలతో సమాసం కట్టరు. కానీ ఒక్క కృష్ణశాస్త్రిగారు మాత్రమే భావాలతో సమాసం కట్టగలరు. ముఖ్యంగా ఆయన పాటలలో ఈ ప్రత్యేకత విశిష్టంగా కనిపిస్తుంది.

కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు పద్యానికి, పాటకు కృష్ణశాస్త్రిగారు పెట్టినది పేరు. కృష్ణశాస్త్రిగారే తన కావ్యంలో ఒకచోట——

" వకుళ పరిమళమును
వేణువికచగీతి
కార్తిక జ్యోత్స్న
నిండిపోగా నెడంద
అవిధుతరాత్రి ఏమి సేయంగ నేర్తు ?
ఊరకే చెలియించి నిట్టూర్పుగాని "

– అని ఒక విరహిణి పరంగా చెప్పబడిన పై వాక్యాల లోని భా వా ల లో ఎన్ని మధురమైన సమాసాలను అల్లగలిగారో మనకు ఎదితమౌతుంది. భావాలతో, ఊహలతో రచనలు చేయడం ఒక విశేషం! కానీ రచనలలో భావాలతో సమాసాలు కట్టడం అనేది మరో విశేషం!

" భావమ్ ప్రధానమ్ కవిత్వం భావ కవిత్వమ్ " అనే నానుడి లోకంలో బాగా ప్రసిద్ధమైంది. భావ కవిత్వానికి ఆద్యుడు కాకపోయినప్పటికినీ, కృష్ణశాస్త్రిగారు పూజ్యులే! 1925 సంవత్సరంలో ఆయన ప్రచురించిన ' కృష్ణపక్షం ' ఆధునికాంధ్ర సాహిత్య ప్రపంచంలో మొట్టమొదటి కావ్యం. భావ కవితా ప్రపంచంలో కృష్ణపక్షం ఒక విశిష్టమైన స్థానాన్ని పొందగలిగింది.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థంలో ప్రారంభమైన ఆధునిక కవిత్వం ఇరవయ్యో శతాబ్ది ప్రారంభం నాటికి నూతన రూపు రేఖలను సంతరించుకొంది. అందులో ప్రధానమైన అంశం ' భావ కవిత్వమ్ '. ఈ కవిత్వం కూడా ఆంగ్ల సాహితీ సంపర్కంవల్ల ఆంధ్ర సాహిత్యం లోకి ప్రవేశించినదే! ఒక విధంగా భావ కవిత్వాన్ని ప్రారంభించినవారు రాయప్రోలువారైతే, దానికి ఒక ఊతా - పట్టుగా నిలిచినవారు కృష్ణశాస్త్రిగారు. ఈ ఇరవయ్యో శతాబ్దినుండి ప్రారంభమైన సాహిత్యాన్ని పరిశీలిస్తే-అందులో కృష్ణశాస్త్రిగారి పాత్ర బహుధా ప్రశంసనీయమైంది. గుర్తించుకోదగింది. అంతటి బహుముఖ ప్రజ్ఞాపాటవాలను కలిగియున్న కృష్ణశాస్త్రి గారిని గురించి ప్రముఖ ఆధునిక కవి దేవరకొండ బాలగంగాధరతిలక్ తన ' అమృతం కురిసిన రాత్రి ' కావ్యంలో ' నవత-కవిత ' అనే ఖండికలో కవిత్వం గురించి—

" కవిత్వం ఒక అందమైన అల్కెమీ
దాని హృదయం కవికే తెలుసును
కాళిదాసుకు తెలుసు! పెద్దన్నకు తెలుసు
కృష్ణశాస్త్రికి తెలుసు! శ్రీశ్రీకి తెలుసు "

– అని పలుకుతారు. దీనినిబట్టి ఆధునిక సాహిత్య లోకంలో కృష్ణశాస్త్రిగారి స్థానం ఏమిటో మనం పరిశీలించి అవగాహన చేసికోవచ్చును. ప్రముఖ అభ్యుదయ కవుపైన ఆరుద్రగారు ( భాగవతుల శివశంకరశాస్త్రి ) ఒకచోట కూనలమ్మ పదాలను రాస్తూ కృష్ణశాస్త్రిగారిని గురించి—

" కొంతమందిది సమత
కొంతమందిది మమత
కృష్ణశాస్త్రిది కవిత
ఓ కూనలమ్మా! "

– అని అంటారు. ఆ అభిప్రాయంతో ఏకీభవించని సాహితీపరుడుండడనుటలో ఎటువంటి అతిశయోక్తి లేదేమో! అందులకే ఆయన్ను ' భావ సమాస రచనా శిల్పి ' అని ప్రస్తుతిద్దాం! ★

పుస్తక సమీక్ష ( 25 వ పేజీ తరువాయి )

యెవరు పేశారు? శివలింగం, పానవట్టం కల్గిన పూలున్నాయి. ప్రకృతిలో ఈ వైచిత్రిని హేతువాదు లేమంటారు? సాలగ్రామ శిలలో, సాలగ్రామ వృక్షా లలో భగవంతుడిని భారతీయులు దర్శిస్తారు జంతువులకు, శిలలకు, చెట్లకు ఆత్మలేదనే జాతి ఒకటి ఉంది. వాళ్ళతో మనకు పనిలేదు.

శ్రీ లింగమూర్తిగారు కేవల పండితులే కాదు, ఆర్ష బోధకు తగిన రచనాపటిమ గలవారు. సాంస్కృతికంగా భారతదేశంలో భాగమైన నేపాలు యాత్ర, తులసి చరిత్ర యిందుకు నిదర్శన. సాలగ్రామ పరీక్షను గురించి వీరు చక్కని వివరణ యిచ్చారు. ఇది నీటిపై తేలుతుంది. పాలలో ముంచితే బరువెక్కుతుంది. ఈ శిల లోపల మత్స్య కూర్మ వరాహాది అవతార చిత్రాలుంటాయి- బ్రాహ్మణునికి దగ్గర ఉంటే అది పాకుతూ వచ్చి వానిని పట్టుకుంటుంది. ఇవన్నీ యదార్థ విషయాలు. ప్రతి ఆస్తికుడు చదువ వలసిన గ్రంథం.

ప్రాప్తిస్థానం కె. కిశోరుబాబు 15-34, వాణీసదనం, నాగర కర్నూలు. వెల 15-00

– కాజ లక్ష్మీనరసింహారావు

# విశ్వనాథ కవితా దర్శనము

ప్రాచీన ఆంధ్ర కవిత్వపు గుబాళింపులను తన మనస్సులో సుప్రతిష్ఠితమొనర్చుకొని, ఆధునికాంధ్ర సాహిత్యంలో మకుటాయమానంగా వెలుగొందిన కవి శ్రేష్ఠులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. రసవంతమైన తన కవిత్వంచే ఆంధ్రవాఙ్మయంలో నూత్న కవిత్వ ఉషోదయావళిని వెదజల్లిన కవి భాస్కరుడు విశ్వనాథ. వచన కవిత్వం తక్క తక్కిన ప్రాచీన ఆధునిక ఆంధ్ర ప్రక్రియలనన్నింటిని చేపట్టి "సకల సాహిత్య ప్రక్రియా విశ్వనాథుల"ని పేరు పొందారు శ్రీ విశ్వనాథ. "పొలములో వాన యొక్క చెక్క గురిసి వేరొక చెక్క జుక్క పడదె" అని శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో వీరన్నట్లుగా వీరి ప్రతిభ వీరి రచనలన్నింటిలో సమంగా గోచరిస్తుంది. వీరి కావ్యాలలో మకరంద సదృశమైన మనోజ్ఞ విశేషాలు పాఠకులకు అడుగడుగునా గోచరిస్తాయి. దేశభక్తి, ఆంధ్రత్వాభిమానం రసార్ద్ర దృష్టి, శైలీ రామణీయకత, వర్ణనా బాహుళ్యం, పాత్రచిత్రణా నైపుణ్యం, భావ తీవ్రత మొదలగు విశేషాంశాలతో వీరి కవిత్వం అజరామరంగా నిలిచింది.

విశ్వనాథ్ భమిడిపాటి

దేశభక్తి, ఆంధ్రత్వాభిమానాలతో విశ్వనాథ రెండు బృహత్తర పద్య కృతుల్ని వెలయించారు. (1) ఆంధ్ర ప్రశస్తి (2) ఆంధ్ర పౌరుషము. సమకాలీన సమాజం పరపీడా పరాయణత్వంలో (ఆంగ్లేయుల పాలనలో) క్రుంగిపోతూ వుంటే, జాతీయ రాష్ట్రీయ భావాలకు నెలవైన విశ్వనాథవారి హృదయంలో విషాదం కట్టలు త్రెంచుకుంది.

"అస్వతంత్రత దారలు నా యాంధ్రశక్తి,
నన్ను గంపింప జేయుచున్నది భృశమ్ము !"

అని వీరు వాపోయిరి. "ఇట వేగీశుల పాద చిహ్నములు లేనేలేవు పో............యాభోగమేలాటిదో" అని వీరు పూర్వ వైభవమును అపూర్వముగా పొగడిరి. సత్యనారాయణగారాంధ్ర సోదరులకు కళాంకమ్ముగా ఆంధ్ర ప్రశస్తి నందించిన విద్వత్కవివరేణ్యులు. ఆంధ్ర ప్రశస్తియందు మహా ప్రబంధ రచనా సౌందర్య సౌరభ్యాలు, మాధ్వీక మధుర భాషా మనోజ్ఞకాలు, నిండారి యుంటాయి.

"వాక్యం రసాత్మకం కావ్యం" అని విశ్వనాధుడనే ఆలంకారికుని కావ్య నిర్వచనం. ఉత్తమ కావ్య ప్రధాన లక్ష్యం రస వ్యంజకత్వం. "ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి రెట్లు గొప్పది నవకథా దృతిని మించి" అని సత్యనారాయణగారి సత్యోక్తి. వీరరసద్యోతకమైన "ఒకనాడు గలదాంధ్ర యువకులు" అనే పద్యంలో గతకాల వైభవం స్ఫురించడం విశేషం. 193. వ సం॥ లో సత్యనారాయణగారికి ప్రథమ భార్యా వియోగం సంభవించింది. అప్పుడు రచించిందే 'వరలక్ష్మీ త్రిశతి' అనే శతకరాజం. ఈ శతకంలో కరుణ రసం పరాకాష్ఠ స్థితి నందుకుంది.

"పితృదత్తమగు నాస్తి హతమయ్యె నాయందు,
అయనిచ్చిన భార్య అస్లె పోయె
నా తండ్రి చేసిన నానా మహాపుణ్య కర్మలీగతి
గంగ కలసిపోయె, నా శరీరాస్థి నిజము
కృష్ణార్పణమ్ము"

పై వీరి కవితలో కరుణ రసం జాలువారింది. వీరి గేయ కావ్యాల్లో ప్రశస్తి గాంచింది కిన్నెరసాని పాటలు. భర్తలో ఘనీభవించిన కరుణం, భార్యలో పరవళ్ళు త్రొక్కిన కరుణం ఆకృతి కల్పన కాలంబనంగా గ్రహించారు విశ్వనాథ. రసదృష్టి యొక్క మార్మికత నెఱింగిన మహాకవి సత్యనారాయణగారు.

" Style is the man " అని ఆంగ్లేయులన్నట్లు సాహిత్యమున శైలికొక ప్రత్యేక స్థానమున్నది. తనకొక ప్రత్యేకమైన శైలిగల కవి విశ్వనాథ. "నేను ఏది రచించినా అందులో జిగి బిగి తప్పకుండా వుంటుంది." అని విశ్వనాథ వాక్కు. తమ కవితలో అటువంటి శైలీ రామణీయకతను సాధించి చూపించినారు విశ్వనాథ. సాధారణంగా విశ్వనాథవారి సమాసాలు బండరాళ్ళవలె విడదీయరాని బంధం కలిగి వుంటాయి. ఆ సమాస కాఠిన్యం సందర్భానుకూలంగా వుంటుంది. రాముడు సీతా స్వయంవరంలో శివధనుర్భంగం చేస్తాడు. ఆ సందర్భం లోని ( కల్పవృక్షంలో ) పద్యం ఇది.

శా॥ నిష్ఠావర్షదుదార మేఘ పటలీ నిర్గచ్ఛదుద్యోతిత
న్వేష్టేరమ్మద మాలికాయుగ పదుజ్జృంభన్మహా
ఘోర బం
హిష్ఠ స్ఫూర్జధుషండ ఘర్ఘర రవాహీన
క్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠమ్మై యొక రావమంతట నెసంగెన్ ఛిన్న
చాపంబునన్.

ధనుర్భంగధ్వని భూలోకంలోనేగాక ఊర్ధ్వలోకంలో కూడా ఏ విధంగా వ్యాపించిందీ అన్న విషయం సమాస కాఠిన్యంతో స్పష్టం చేయబడింది. విశ్వనాథవారు వ్రాసిన శశిదూతం, కిన్నెరసాని పాటలు, శృంగారవీధి ఇవన్నీ సుకుమార శైలీ విలసితాలే. ఈక్రింది కిన్నెరసాని గేయంలో ముత్యాల సరాల శైలి మనకు కనిపిస్తుంది.

జలజలా పొంగింది బిలబిలా నడిచింది
పరికిణీ తొక్కాడు పదియేళ్ల కన్నెలా
చిన్ని గంతులు వేయు తెల్ల నాచెయ్యలా
పసిపాప నెలవి వారిన బోసి నవ్వులా.

సందర్భానుకూలములై, వర్ణనాంశాన్ని సుస్పష్టరేఖలతో గోచరింప జేసేవిగా ఉండడం అలంకార లక్షణం. విశ్వనాథ వారి అలంకారాలు వర్ణ్య వస్తువు యొక్క ఉన్న రూపాన్ని చెప్పటంతో ఆగక ఊహా ప్రపంచాలకు పాఠ కుణ్ని క్రమంగా తీసుకుని పోతవి. మాలోపమలో విశ్వ నాథ వారిది అందెవేసిన చేయి.

(1) కదలగా కదలగా కాంత కిన్నెరసాని;
పదుపు కట్టిన వేళ్ల కదుపులా తోచింది.
కదలు తెల్లని పూల నదివోలె కదిలింది;
వదలు తెల్లని త్రాచుపడగలా విరిసింది.

(2) జలదేవతల వెంట సాగి కిన్నెరసాని ;
తెలి తారకల వెంట వెలుగులా తోచింది
తలిరు పూవుల వెంట తావిలా తోచింది;
తెనుగు పాటల వెంట తీపిలా తోచింది;

కిన్నెర నడకను వేళ్ళకదుపుతో, పూలనదివోలె అని పోల్చుటయేగాక తెలితారకలతో పోల్చి చూపుట విశ్వనాథ వారి మాలోపమా శిల్పం. హేమంతర్తువులోని మంచు బిందువులు ఉత్ప్రేక్షాలంకార భూషితాలై ఉజ్వల తారకల్లా విశ్వనాథ కవితలో ప్రకాశించాయి.

సీ॥ తట్టలో గూర్చుండ బెట్టిన వధుపునా గుమ్మడి పూవులో గులికెనొకటి ........ప్రాతరంత హేమంత వేళ॥

విశ్వనాథ వర్ణనా పాండితీ ప్రతిభకు అచ్చపు మణి దర్పణం వారి ఋతు సంహార కావ్యం. తెలుగు పల్లెల జీవనాన్నే కాదు; తెలుగు పంటల వైభవాన్ని కూడా విశ్వనాథ ఋతుధర్మ విశేషాల్లో విశ్లేషించి వర్ణించారు.

" పొద్దుటింతల వాయువులు తావికై మెల్లకొతిమేర చేలపై గొనరు లాడె. చిఱుచేదు వలచె గోసిన జొన్న చేనిలో తొడిమి దగ్గర పచ్చ దోన పండు "

దేనిని వర్ణించినా దాని సమగ్ర స్వరూప తత్వాల్ని ప్రత్యక్షం చేసి చూపడం విశ్వనాథకు వరిపాటి. అహల్యకు రూపం వచ్చెడి సందర్భంలో శ్రీమద్రామాయణ కల్ప వృక్షంలో విశ్వనాథ రచించిన సీస పద్యం వర్ణనా లాలిత్య సంయుతం. ఆ పద్య సౌందర్యం అనుభవైక వేద్యం.

సీ॥ ప్రభు మేనిపై గాలి వచ్చినంతనే; పాషాణ మొకటికి స్పర్శ వచ్చె/ ప్రభుకాలి సవ్వడి ప్రాంతమైనం

తనే; శిలకొక్క దానికి జెపులు కలిగె...............
శ్రీరామ భద్రాభి రామమూర్తి యగుచుదోచె;

విశ్వనాథ వారి పాత్రచిత్రణా నైపుణ్యం పేర్కొన దగింది. రామాయణ కల్పవృక్షంలో " రామో విగ్రహవాన్ ధర్మః " అన్నట్లు రాముని, జగన్మాతగా సీతను, పుత్రవాత్సల్య సహితునిగా దశరధుని వీరు తీర్చిదిద్దారు. విశ్వామిత్రుని పాత్ర వీరి యద్భుత సృష్టి. వీరిపాత్రలలో శాశ్వత కీర్తి నందిన మరొక పాత్ర కిన్నెరసాని. భద్రాద్రి రాముని త్రోవకాచి, గోదావరి నదీమతల్లి ఒడిలో నిలచిన కిన్నెరసాని వాగు విశ్వనాథ కల్పనలో ఉద్విగ్నమైన తెలుగు వడుచులా ప్రణయమూర్తిలా చిత్రింప బడింది.

విశ్వనాథ వారి భావ తీవ్రత అనన్య సాధ్యమైనది.

(1) నిత్యవేగి నా చేతము శబ్దమేరుటకు జిన్నము
నిల్వదు భావతీవ్రతన్.

(2) ఈ గగనంపు బెల్లల చరించెడు బాల విహంగ
కోటికంటె.............................. నా
శాగతి వోయెడుస్ పరవసంబున నాయెదలోనిభావముల్.

అని వీరి భావతీవ్రతా వివరణ. శ్రీనాధుని వలె విశ్వనాధ కూడా ఈశ్వరార్చనా కళాశీలుడు. విశ్వేశ్వర శతకంలో వీరి ఈశ్వరభక్తి వెల్లడి అవుతుంది.

" ఎవ్వరేమన్నగాని నాకేమి కొరత " అని శ్రీనాధుడన్నట్లు ఎవ్వరేమన్నను విశ్వనాథ మహాకవి. చైతన్య దీప్తితో పాఠకుల మన్ననల నందుకొని జ్ఞాన పీఠ బహుమతితో విశ్వవిఖ్యాతుడైనాడు, కవి సామ్రాట్టు విశ్వనాథ.

***



# భిన్నత్వంలో ఏకత్వమే భారతీయ మూలతత్త్వం

(గతంలో ఒక న్యూఢిల్లీ వారపత్రికలో ఇంగ్లీషులో ప్రచురితమైన సొంత వ్యాసానికే ఇది కొద్ది మార్పులతో అనువాదం)

భారతదేశం ఎన్నో సమస్యలు ఎదుర్కొంటోంది. కాని ఏదేశానికి సమస్యలులేవు? జాతిని "పట్టిన" రోగాల్ని నిదానించి, ఉచిత చికిత్సలు సూచించే వైద్యులకు కొదువ లేదు. కాని భారతదేశపు దౌర్భాగ్యమేమంటే ఈ వైద్యులు బహు అరుదుగా మాత్రమే ఏకాభిప్రాయానికి వస్తారు. అంతకన్న శోచనీయం ఏమంటే "రామబాణా" ల్లాంటి మందులు చెప్పి, రోగినే హతమార్చడంద్వారా రోగాన్ని హతమార్చే నకిలీ భిషగ్వరులు కోకొల్లలు. దానితో ప్రతీదీ ప్రాణాంతక పరిస్థితిని తెస్తోంది.

వాసమూర్తి

స్వాతంత్ర్యం వచ్చిన తొలిరోజుల ఆవేశంలో కొందరు - అలాంటివారు ఇప్పటికీ ఉన్నారు ఐకమత్యాన్నీ శక్తినీ ప్రోత్సహించేందుకు ఒకే జాతీయవేషం నిర్ణయించాలన్నారు. కాని జాతీయవేషం అంటే ఏమిటి? అమెరికా, ఇంగ్లండు, ఫ్రాంసు, జర్మని, రష్యా వంటి దేశాల జాతీయ వేషాలు ఏమిటో మనం చెప్పగలమా? వేషంలో సంప్రదాయం అనేది ఒకటి ఉంది. దానిని పాటించడం, దానిపట్ల గర్వించడం స్వతంత్రజాతుల లక్షణం. కాని అనంత వైవిధ్యంకల భారతదేశంవంటి బృహద్దేశంలో భిన్న పరిసరాలూ, వాతావరణాల కనుగుణంగా మన దేశపు సంప్రదాయమే ఎంతో వైవిధ్యానికీ, సౌందర్యానికీ ఆకర్షణకీ తావిస్తుంది. ఈ మనోహర, సజీవ వారసత్వాన్ని తోసిపుచ్చి, విదేశీ మోజులో పడడం గర్హనీయమేకాని జాతీయవేషం అంటూ దేశం మొత్తంమీద ఏది విధించగలం? కొందరి దృష్టిలో "జాతీయ వేషం"గా పరిగణింపబడుతున్నది ఈ దేశపు చిరకాల సంప్రదాయాన్నీ, తత్వాన్నీ ప్రతిఫలిస్తుందా? మనం బయటికి వచ్చినపుడల్లా "జాతీయ వేషంలోనే" దర్శనమివ్వాలని రాజ్యాంగంలో పొందుపరచలేదు. అంతవరకు అదృష్టవంతులమే! - కాని కొందరు అటువంటి సూచన చేయకపోలేదు.

గతంలో ఒకటి రెండుమార్లు జాతీయాహారం అంటూ ప్రకటనలుకూడా వచ్చాయి. ఒకే జాతీయాహారం ప్రాంతీయపు గోడల్ని ఛేదించి దేశం నలుమూలలా ఏకతాభావం వ్యాపింపచేస్తుందని ఆ మహానుభావులు భావించారు. ఒకరిద్దరు ఆహార మంత్రులు కూడా అప్పట్లో ఆ సూచనపట్ల ఆకర్షితులైనట్లు గుర్తు. ఆహారధాన్యాల కొరత - ముఖ్యంగా వరిధాన్యపు కొరత ఉండేది. విదేశాలనుండి భారీఎత్తున ఆహారధాన్యాలు దిగుమతి చేసుకోవలసి వచ్చేది. ఆ దిగుమతి చేసుకున్నదికూడా ప్రధానంగా గోధుమ అయివుండేది. అందువల్ల ఆ మంత్రులూ పైన చెప్పిన మహామహులూ వరి (అన్నం) తినేవారిని వరి బియ్యం వదిలిపేసి గోధుమే తినడం మొదలుపెట్టమని సూచనలు చేశారు. మళ్ళీ మన అదృష్టవశాత్తు మనకు నచ్చినదీ, మనకి అలవాటు అయినదీ తినే హక్కు ఇంకా మనకు మిగిలివుంది.

మరొక రంగం చూదాం. భారతదేశంలో రెండు ప్రధాన సంగీత సంప్రదాయాలున్నాయి - హిందూస్తానీ, కర్ణాటక. దేనికి దానికి అపూర్వమూ, సుసంపన్నమూ అయిన సంప్రదాయం ఉంది. విశిష్టమైన శైలీ, ఆకర్షణా ఉన్నాయి. కొందరు ఉగ్ర జాతీయవాదులు బయలుదేరి రెండు సంగీత సంప్రదాయాల ఉనికి దేశపు ఐకమత్యానికి హాని అని భావించారు. (అవును, రెండు రెండే, ఒకటి కానేరదు కదా) అందువల్ల రెండు సంప్రదాయాల్నీ కలిపి వేసి ఒకే భారతీయ సంగీతం ఏర్పరచాలని బ్రహ్మాండమైన సూచన చేశారు. రెండు సంప్రదాయాల్నీ కలిపి ఒకటి చేయడం పరిశోధనశాలలో రెండు ద్రవాలు కలిపి వేసినంత తేలిక అన్నట్లే.

పైన చెప్పినవన్నీ కపోల కల్పిత భూతాలుకాదు. అటువంటి సూచనలు నిజంగాజరిగినవే. చేసినవారూ సామాన్యులుకారు—అధికారం, గౌరవం, ఉన్నవారే. వివిధ భారతీయ లిపుల్ని రద్దుచేసి ఒకేలిపిని జాతీయమైన నాగరలిపిని కానీ, అంతకన్న గొప్పగా అంతర్జాతీయ లిపి రోమన్‌లిపిని కానీ వాడుక చేయాలని చెప్పేవారు ఇప్పటికీ లేరా ? ఒకేఒక జాతీయభాషకోసం దేశంలోని వివిధ భాషల్నీ నిరుత్సాహపరచాలని ఎవరూ సూచించకపోయి నందుకు మనల్ని మనం అభినందించుకోవాలి.

_ ఈ అసంగత సూచనలు ఈ విషగ్వరులు భారతదేశం అంటే ఏమిటో సరిగా అర్థంచేసుకోలేదన్న సత్యాన్ని బయటపెడతాయి మరి ఏ యితర దేశానికీ—ఆఖరికి చైనాకికానీ, సోవియట్ యూనియన్‌కుకానీ, యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాకుకాని, భారతదేశానికి ఉన్నంతగా వాతావరణం, ప్రదేశం, వృక్షజాతి, జంతుజాతి, జాతి, మత భాషా సంస్కృతుల అద్భుత వైవిధ్యం లేదు. చరిత్రకందని కాలంనుంచీ ఇలాగే ఉంటూవచ్చింది. ఈ మనోహర వైవిధ్యాన్ని నాశనంచేసి, నిస్సారమైన ఏకరూపక తేవడానికి ప్రయత్నించినవారు వైఫల్యమే ఎదుర్కొన్నారు. విచిత్రంగా తామే ఆ వైవిధ్యానికి మరొక పక్షం చేర్చినవారయ్యారుకూడా. ఇంత వైవిధ్యం ఉన్నప్పటికీ ఈ దేశాన్ని కలిపివుంచే అదృశ్యమయిన బంధాలు కొన్ని ఉన్నాయి, ముత్యాలహారంలోని ముత్యాలనుంచి పోయే సూత్రంలా. సాధారణంగా అదృశ్యమయిన, అయినా వాస్తవమైన ఈ బంధాలు లేకపోయివుంటే భారతదేశం ఇంతకాలం ఏకదేశంగా మనగలిగి ఉండేదికాదు. మనదేశం ఈ వైవిధ్యానికి ఎప్పుడూ మంచి అవకాశం

## ప్రశ్నలు-సమాధానాలు

1. "లిక్విడ్ గోల్డు" అని పిలువబడునది ఏది ?
2. ఇండియాలో టెలిఫోన్ మొట్టమొదటగా పని చేసినది ఎపుడు ?
3. "రెడ్ ప్లానెట్" అని ఏ గ్రహమును పిలతురు?
4. "ఎటర్నల్ సిటీ" ఏది ?
5. భారతదేశంలో పొడవైన బ్యారేజ్ ఏది ?
6. తొలిసారిగా "అణుబాంబు" పేలుడును నిర్వహించిన దెవరు ? ఏదేశం ?
7. "ది సిటీ ఆఫ్ గోల్డెన్ టెంపుల్" ఏది ?
8. ప్రపంచంలోకెల్లా పెద్దదైన నదీప్రవాహమేది?
9. ప్రపంచంలోకెల్లా ఎత్తైన భవనమేది ? దాని ఎత్తు ఎంత ?
10. మన జాతీయ పుష్పమేది ?
11. మలేరియా సూక్ష్మజీవిని కనుగొన్నదెవరు ?
12. పీఠభూములలోకెల్లా ఎత్తైన పీఠభూమి ఏది?

1. పెట్రోలియం, 2. 1853, 3. అంగారకుడు, 4. రోమ్, 5. గాంధీసేతు, 6. రాబర్ట్ ఓపెన్ హీమర్ బృందం, అమెరికా, 7. అమృతసర్, 8. అమెజాన్ నదీప్రవాహం, 9. చికాగోలోని స్పేర్స్ టవర్స్, 110 అంతస్తులు, 1454 అ. ఎత్తు, 10. తామర పుష్పం, 11. రోనాల్డ్ రాస్, 12. టిబెట్ పీఠభూమి.

## నిత్య సత్యాలు

" మనం ఎంత ఎక్కువ పాండిత్యం పోగుచేసుకున్నా మన్నది ముఖ్యంకాదు మనం ఎంతగా అవగాహన చేసుకున్నామన్నదే ముఖ్యం "

— జిడ్డు కృష్ణమూర్తి

" చదువు కామధేనువు వంటిది. అకాలంలో కూడా మంచి ఫలితాల నిస్తుంది "

— చాణక్యుడు.

" గతాన్ని త్రవ్వి నీ శక్తిని వృథాచేయకు. వివేకవంతుడు ఎప్పుడూ వర్తమానంలోనే జీవిస్తాడు. "

- స్వామి వివేకానంద.

" వజ్రాన్ని కూరగాయల సంతలో అమ్మబోతే దానికి పలికేది వంకాయల ధరే "

— కబీరు

" విద్యను దాచుకోవద్దు. పదిమందికీ పంచు. అది మరింత రాణిస్తుంది "

— మహాత్మాగాంధీ

" విద్యార్థి జీవితం విలాస యుతముగ ఉండుట కంటె సామాన్యంబుగా ఉండుటే మంచిది "

—డా. బాబూరాజేంద్రప్రసాద్

" నిరర్థక జీవుడై వేయేండ్లు బ్రతికిన వానికంటే పుణ్యశీలుడై ఒక్క దినము జీవించిన వాడే చిరకాలజీవి అని చెప్పవచ్చును. "

- కందుకూరి వీరేశలింగం

ఇస్తూవచ్చింది కాబట్టే, అది దండెత్తివచ్చిన ప్రతి శక్తినీ వశంచేసుకొని తన విశాల వక్షంలో ఇముడ్చుకుంది కాబట్టే ఎన్నో విపర్యాలను, ఘోర విపత్తులనూ ఎదుర్కొని నిలబడింది.

భారతదేశపు వైవిధ్యం కాదనరాని యథార్థం. దానిని నాశనం చేయగోరేవారు పైపై ప్రజాస్వామ్య రూపాలకు విధేయత ప్రకటించినా, నిజమైన ప్రజాస్వామ్యవాదులు కారని చెప్పవచ్చు. ఎందుకంటే ప్రజాస్వామ్యం ప్రధానంగా సహనంమీద ఆధారపడి ఉంటుంది. అంటే మన భావాలూ, అభిరుచులూ ఆకాంక్షలు ఇతరులమీద రుద్దకుండా మనకెంత ప్రియమైనా ఇతరుల భావాలూ, అభిరుచులూ, ఆకాంక్షలూ సహించడం వాటికి అవకాశమివ్వడమే ప్రజాస్వామ్యం. ఇచ్చిపుచ్చుకోవడం నచ్చచెప్పడం ద్వారానే అది ఏమైనా సాధించదలుస్తుంది.

వైవిధ్యమే జీవిత సుగంధమంటారు. వైవిధ్యం కేవలం జీవితానికి చేర్చేదికాదు, అది జీవితపుసారం, ఊపిరి అనాలి. ప్రకృతిని అవలోకించండి. ఎన్ని అనంతరూపాలు! ఎన్నిరంగుల పరిమళాల మేళవింపులు! మన హృదయం ఎంత ఉప్పొంగి పోతుంది! మనం ఇంద్రధనస్సు రంగులన్నీ కలిపివేశామనుకోండి ఏమౌతుంది? ఒకే ఒక నీరసమైన తెలుపు తయారవుతుంది. వైవిధ్యంలేని జాతి ఏ ఆనందోత్సాహాలు కలిగించని జనాల కలయికమాత్రం అవుతుంది.

వైవిధ్యం విధిలేక సహించవలసిందికాదు. అది నిజంగా స్వాగతించవలసింది. ఎందుకంటే మనం ఈ యంత్రయుగంలో అంతకంతకు విసుగెత్తించే ఏకరూపత్వం వైపుకు సాగుతున్నాం. మనం ప్రపంచంలో ఎక్కడికి వెళ్ళినా ఒకేరకం రేడియోలూ, టీవీలూ, కార్లూ, బస్సులు ట్రెయిన్లూ, విమానాలూ, వీధులూ అంతస్తుల భవనాలూ, ఫ్యాక్టరీలూ, ఆఫీసులు, కళాశాలలూ, ఆసుపత్రులూ, రైల్వేస్టేషనులూ, సినిమాహాళ్లు, పార్కులూ, జూలూ వగైరా చూస్తాం. ఈ నీరస నిస్సార ఏకరూపకత్వానికి భయపడి ఆధునిక మానవుడు ఆహారంలో పదార్థంలో ఏదో ఒక రకపు వైవిధ్యంకోసం తహతహలాడుతున్నాడు. ఆ వైవిధ్యమైనాలేకపోతే జీవితం ఒక అంతులేని ఎడారిలా కనిపిస్తుంది.

కాని ఇక్కడ ఒక హెచ్చరిక చేయవలసివుంది. మనం సమన్వయం, ఐక్యం, క్రమాల ప్రాథమిక సూత్రాలనే విచ్ఛిన్నం చేసే వైవిధ్యాన్ని కోరలేం. రోడ్డు నియ

## పరిణామం

రేడియో మాస్కోలో
శంకరాభరణం పాటలు.
శరీరంలేని ఆల్ ఇండియా
రేడియోల్లో డిస్కో చమక్కులు
ఇదెక్కడి ప్రారబ్ధంరా దేవుడా !
పాచి ముఖంతో బెడ్ కాఫీలు
లేచి లేవకుండానే విస్కీ సోడాలు
కట్టుకున్న ఇల్లాలి ముందే
పేకముక్కలు పంచడాలు
కట్నం తక్కువైతే
సాధింపులతో సరిపుచ్చక
గొంతు నులిమి చంపడాలు
అన్నీ విపరీతకృత్యాలైపోయాయి -
దేవుడా మరి నా దేశాన్నెప్పుడు
కాపాడి రక్షించగలవు ?
ఈ ఘోరకలిని ఎన్నడాపగలవు ??

— మంతెన సూర్యనారాయణరాజు

మాలలో వైవిధ్యం ఉండజాలదు. వాస్తుకళని ఉదాహరణగా తీసుకోండి. ఒక భవనం నిర్మించేటప్పుడు ఆరోగ్యానికిగానీ, ప్రాణానికికానీ అపాయమూ నష్టమూ కలుగకుండా ఉండేందుకు పునాదుల లోతూ, వెడల్పూ, వాడే పదార్థాల బలమూ, సరియైన పాళ్ళలో మిశ్రమమూ, గాలీ వెలుతురూ వగైరా ఏర్పాట్లు మొదలైనవాటి విషయంలో మనం కొన్ని కనీస ప్రాథమిక సూత్రాలను పాటిస్తాం. ఆ సూత్రాలు పాటిస్తూనే సౌఖ్యానికి ఆనరాలు, ఆనంద నిలయాలూ అయిన వేలాది రకాల భవనాలు నిర్మించుకోవచ్చు. అలాగే ప్రాథమికమైన ఏకత్వానికి హాని కలుగనంతవరకూ జీవితంలో ఆనందానికీ, ఉత్సాహానికీ తోడ్పడే దేనినైనా మనం ఆహ్వానించవచ్చు.

ఈవిధంగా రెండు సంగీత సంప్రదాయాలుంటే అది మరింత హర్షదాయకమే. రెండూ భారతీయమే. రెండూ మన వారసత్వపు గొప్పతనానికి, తోడ్పడేవే (ఇలా అంటున్నామంటే రెండు సంప్రదాయాలూ ఒకదానికొకటి సంబంధంలేని వేరువేరు గదులలో ఉండిపోవాలని కాదు. ఒకటి వేరొకటిచేత కొంతవరకైనా ప్రభావితం కాకపోదు. అలా ఇచ్చిపుచ్చుకోవడాన్ని ప్రోత్సహించవచ్చుగాని, పైనుంచి బలవంతంగా విధించకూడదు. అటువంటి జోక్యం రెండింటికీ ప్రాణసంకటం తెచ్చిపెడుతుంది). అందువల్ల మనం మన దేశపు అనంత వైవిధ్యానికి గర్వపడాలి. ఎన్నో నృత్యరీతులు, చిత్రలేఖన శైలిలూ, వాస్తుకళ విధానాలూ, రకరకాల వేషాలూ, ఆహారపు టలవాట్లలో సాంఘికాచారాల్లో వైవిధ్యం, వివిధ భాషలూ మతాలూ పూర్తిగా వర్ధిల్లనివ్వాలి. మనం వైవిధ్యంలో సమన్వయానికి కృషిచేయాలికాని విసుగెత్తించే ఏకరూపకకి కాదు. తప్పుగా అర్థంచేసుకున్న జాతీయతా, సమైక్యతా పేరిట భారతీయ మూలతత్వాన్నే దెబ్బతీయకూడదు. మనం దేశాన్ని మన సంకుచిత దృష్టికి అందుబాటులో ఉండే విధంగా నరికివేసే ప్రయత్నం చేయకూడదు. మన దృక్పథాన్ని విశాలం చేసుకొని మనమే మన గొప్ప దేశానికి తగ్గట్టు ఎత్తుగా ఎదగాలి.

(ఇటీవల జర్మనీనుంచి ఒక భారతీయ శాస్త్రవేత్త "హిందూ" పత్రికకు లేఖరాస్తూ తాను విదేశాల్లో తమిళుల్ని, బెంగాలీలనీ, మహారాష్ట్రులనీ చూశానుకాని భారతీయుల్ని చూడలేకపోయానని విలపించాడు. విచిత్రంగా ఆయన విదేశాల్లోని ముస్లింలలో భారతీయుల్ని చూడగలిగాడట ! కాని ఆయన మహారాష్ట్రులూ, తమిళులూ బెంగాలీలూ మొదలైనవారిలో భారతీయత్వమే ఉందని గుర్తించలేకపోయాడన్నమాట. ఇంతకీ ఆయన ఆవేదన ఇంగ్లీషునే దేశపు ఏకైక భాషగా చేసి భాషారాష్ట్రాలను రద్దుచేసే పథకానికి సమర్థన మాత్రమే అని తేలుతుంది.) ★

కింది పెదవిని కసిగా కొరుక్కుంటూ రాణి శిరోజాలను తన ఎడమ చేత్తో స్పృశిస్తూ స్క్రీన్‌మీద బొమ్మలను రాణి రెండు కళ్ళలోనే త్రీడీ పిక్చర్‌లా చూస్తూ వున్నాడు రవి.

ఆట మొదలైంది.

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్




# హ్యూమానిటీ ఫర్ సేల్

ప్రణయం యొక్క గొప్పతనాన్ని గూర్చి సినిమాలో కథానాయకుడు ఉపన్యాసాలు ఇస్తున్నాడు——

'ప్రేమించడం నా జన్మహక్కు. ప్రేమ కోసమే పుట్టాను నేను. ప్రేమలేని ప్రపంచం నా కొక స్మశానం. ప్రేమతో నిండిననాడు నా పాలిటి కాననం-నందనం-సుందరం మందిరం. నా గుండె గోడల నిండా ప్రేమ మందిరాల బురుజులు నిలువుగా అడ్డంగా నిగడతన్ని లేచాయి——ప్రేమముందు తల్లీ తండ్రీ దేవుడూ క్షుద్రులు-ప్రేమతో నిండిన కన్నీళ్ళు నాకు పరవళ్ళు-బ్రతుకు బాటకు ఒరవళ్ళు ప్రియా-నేను నీ కోసమే పుట్టాను-నీ కళ్ళకోసం, నీ కనుబొమ్మలకోసం, నీ పళ్ళకోసం, నీ పెదాలకోసం, నీ హృదయంకోసం, నీ గుండెలకోసం, నీ చీరెకోసం, నీ బ్లౌజ్‌కోసం-నీ కోసం-నీ కోసం-నీ కోసం....' నాయకుడు నాయికను హృదయానికి హత్తుకున్నాడు. సెన్సారు కత్తెరలను తెలివిగా మభ్యపెట్టి సెక్సు ప్రదర్శనం చేస్తున్నాడు-తెరకు దగ్గరగా కూర్చున్న జనం ఈలలు-కరతాళధ్వనులు 'హాయ్ హాయ్-' ఉద్రిక్త నినాదాలు-హాలంతా కామ రసాయనంలో మునిగి తేలుతున్నది-కన్నూ మిన్నూ కానకుండా చీకట్లో పరవశించిపోతున్నది——

'హ హ్హ హ్హ హ్హ హ్హ' రామాయణంలోని రావణాసురునిలా, ప్రహ్లాదలో హిరణ్యకశ్యపునిలా కథానాయిక తండ్రి - ధనమదాంధుడు తెరపైకి వచ్చాడు-ఈ సినిమాలో అతడే విలన్-అతడే బాక్సాఫీసు హిట్‌కు పెద్ద ఎట్రాక్షన్. గొంతులో గరిటె తిప్పినట్లు ఒక్కొక్క శబ్దమే వదులుతున్నాడు. 'ఈ ప్రేమా గీమా నా ముందు పనికిరావు. ఇలాంటి చౌకబారు పదాలతో నా అంతస్థునూ అధికారాన్ని ఎవడూ అవమానపరచలేడు——నా బొందిలో ప్రాణం వుండగా ఈ వివాహానికి నేను అంగీకరించను-బిజూ

విలన్ మిత్రుడు మొఖం నిండా కత్తి గాట్లతో బోడి గుండుతో అడ్డ లుంగీతో ప్రవేశం-'హ హ్హ హ్హ హ్హ హ్హ'

కెవ్వున హాలులో పసిపిల్లల ఆర్తనాదం——

'చూడు-వాణ్ణి రూపులేకుండా 'ఖస్'-మనిపించాలి' చేతితో నటిస్తూ ప్రదర్శించాడు గుండు గుండుకు.

'రైటో బాస్-' ఇనప బెల్టును ఛెళ్ళుమనిపించాడు-

ఏమౌతాడింక కథానాయకుడు ? ?

ఏమౌతుంది కాలువలు కట్టి పారుతున్న అతని ప్రేమ-

'ప్రేమలోన ప్రేమతోడ ప్రేమ కొరకు ప్రేమ వలన ప్రేమనే ప్రేమచే ప్రేమవంటి ప్రేమహో! ప్రేమహో-ప్రియమహో' నేపధ్య సంగీతం చెవులు గింగురుమనిపించే పాట........

అగాధమైన సస్పెన్సు- సీట్లమీద నుంచి కదలడానికి వీలులేనంత థ్రిల్లర్ - ఇంతలో ఇంటర్వెల్ - లైట్లు వెలిగాయి-ఉలిక్కిపడి సర్దుకున్నారు.

రాణీ—రవీ—

'సార్-మకరంద్ అంటే మీరేనా-' పొడవైన డాక్టర్స్ కోటు చూచివచ్చి రవిని అడిగాడు ఓ నౌకరు.

'కాదు—ఏం ?'

'ఎందుకో అర్జంటుగా వారికి ఫోను వచ్చింది సార్....' నౌకరు వెతుక్కుంటూ ముందుకు పోయాడు—

దూరాన ఒక మూల తల పట్టుకొని ఆస్ప్రో బిళ్ళలకోసం జేబులు గాలిస్తున్న మకరంద్ అతన్ని చూచాడు-'సార్-మీ కోసం ఫోను వచ్చింది - అర్జంటుగా ఇంటికి రమ్మంటున్నారు-'

ఈ లోపలే మకరంద్ లేచిపోవడానికి సర్దుకున్నాడు. ముందుకు నడిచాడు సీట్లవెంట—

మకరంద్‌ను చూచి రవి చూడనట్లు నటించాడు—

మకరంద్ వారిరువురినీ చూచాడో చూడలేదో-ఆఫీసులోకి వెళ్ళి మేనేజరు దగ్గరున్న ఫోను తీసుకొని మాట్లాడాడు 'హల్లో-హల్లో—ఎవరూ కాంపౌండర్-అలాగే ఇప్పుడే వస్తున్నాను....' నుదురు తుడుచుకొని ఫోను పెట్టేశాడు—

'థాంక్యూ మేనేజర్ సాబ్-'

'నో మెన్షన్ ప్లీజ్ - ఇందాకటినుంచీ రింగప్ చేస్తున్నారు-ఎలా పిలవడం ఇదేమీ హోటలు కాదు కదా-థియేటర్-ఆట మధ్య-తెలియజేయడమే అసాధ్యం న్యాయంగా.'

(జరిగిన కథ)

డా. రాజు కూతురు రాణి రవి అనే యువకుడ్ని ప్రేమిస్తుంది. వాళ్ళు సాధారణంగా ఏ పార్కులోనో కలుసుకొని కబుర్లాడుకుంటారు. రవి అంతస్తులు గురించి మాట్లాడితే రాణి తేలిగ్గా కొట్టేస్తుంది. రాణికి కొంత మంది అభిమాన సినీ రచయితలున్నారు. వారు రచించే ప్రణయ సూక్తులు గుండె నిండా నింపుకుని, అవసరాన్ని బట్టి రవి ముందు ప్రయోగిస్తూ వుంటుంది. పార్కు నుంచి సినిమాలకి వెళ్ళడం వాళ్ళకి మామూలే. రాణి రవి కన్నా ఛాలా ఫాస్ట్.

(ఇక చదవండి)

'మీ సహకారానికి కృతజ్ఞుణ్ణి—ఇవ్వాళ క్లినిక్‌కు శలవు-అప్పటికీ సాయంత్రందాకా ఇంట్లోనే పేషెంట్లను చూచి కాస్త మెంటల్ రిలీఫ్‌కోసం కాంపౌండర్‌తో మాత్రం చెప్పి ఇలా వచ్చాను గాంధీగారి డాక్యుమెంటరీ కోసం ముఖ్యంగా—ఇంతలోనే ఫోన్ కాల్స్-నిజంగా డాక్టర్స్‌కు ప్రైవేట్ లైఫూ, సరదాలు వుండకూడదు, వుంటే వృత్తికి న్యాయం చేయలేడు-'

మేనేజర్ నవ్వాడు.

మకరంద్ కారు స్టార్టు చేసుకొని బయలుదేరాడు. వెళ్తున్న మకరంద్‌ను భయం భయంగా చూస్తున్నాడు దూరంనుండి రవి హాల్లోంచి బయటకు వచ్చి.

## 4

తీవ్రమైన సుఖ రోగాలూ, గర్భస్రావాలూ డాక్టరు రాజు స్వయంగా చూచుకుంటాడు. తదితర సామాన్య వ్యాధులకు కొంపౌండర్ మందిచ్చి పంపుతాడు. రోగాలు లేకపోతే

## ఆగస్టు రంజనిమాల సమాధానములు

అడ్డము : 1. దశకు బెశకు రాళ్ళు 4. వెలయు వనము 7. పరమ 8. జేఱుచును 9 మేలు చేసి 10. వరద 14. గవ్నయపుడె 15. దూరము పాఱు 16. పెట్టి పోయలేని పట్టి 18. ముండేలు 21. పంది బురద మెచ్చు బన్నీరు మెచ్చునా 23. నల్లగనుండు 24. దెలిసినట్టివారి

నిలువు : 1. దరువు దరవ 2. కురుపతి 3. రాజిలజేసి 4. వెలయును 5. వసుధలోన 6. ముఱికివాగు పాఱుప్రోత 11. దగదెట్టి కార్యంబు 12. యేలినట్టి 13. ఖరముపాలు 17. మేడిపండు చూడ 19. మీద నల్లగ 20. పురుగు చేరి 22. నాశబెట్టి.

పుట్టిస్తాడు. ఉన్నవాటిని ఓ పట్టాన నయం చెయ్యడు. యాదగిరి అనే పేషెంటుకు రెండురోజులక్రితం కడుపులో నొప్పి వచ్చింది. " సర్కారు దవాఖానాలల్లో బంట్రోతు దగ్గరినుండి డాక్టరుదాకా పైసలు తింటారు. క్యూలలో నిలబడాలి. అయినాసరే నయమౌతుందన్న నమ్మకం మాత్రం లేదు. అక్కడ పేరుకు స్త్రీ పురుషుల దవాఖానా అని వున్నది కాని వాళ్ళిరువురూ కానివాళ్ళు మాత్రమే వేస్తే నయమౌతుందేమో-జంతువుల దావాఖానా అనే బోర్డుకు బదులు మనుషుల దవాఖానా అనే బోర్డు పొరపాటున తగిలించారు అని యాదగిరి కొడుకు చెప్పాడు. అతనో చిన్న కార్మిక నాయకుడు. పోచయ్యా వాడి పేరు. అందుకని యాదగిరిని డాక్టరు రాజు దగ్గరికి పంపాడు-శ్యామయ్యంగార్ ఈ కడుపులో నొప్పిని పరిశీలించాడు. నిజానికది ఒకే డోసుతో తెల్లవారేసరికి నయమైపోయి వుండేది. కాని దానివల్ల ప్రయోజనమేమిటి ? ? రోగి కనీసం వారంరోజులన్నా తిరిగినట్లుండాలి. ఇన్నాళ్ళూ డాక్టరు ట్రీట్ చేస్తున్నట్లు కన్పడాలి. ఆపైన నయం కావాలి-అప్పుడు పదిహేను రోజులు వైద్యం చేసినందుకు గాను ఓ అయిదువందలు తెమ్మని గుంజవచ్చు-అందుకనే శ్యాం యాదగిరికి రోగం మరికొంచెం ఎక్కువయ్యే మందు ఒక డోసు ఇచ్చాడు. దానితో ముసలి ప్రాణం ఇంటికి పోయేసరికి గుడ్లు తేలవేసి నాలుక వెళ్ళబెట్టాడు. నోటివెంట చొంగ కారడం మొదలు పెట్టింది—

పోచయ్య అప్పుడే వాడి డ్యూటీనుంచి తిరిగి వచ్చాడు. తండ్రి దురవస్థ చూచాడు—' కింద బెట్టండి-లాభంలేదు అంటున్నారం'తా—పోచయ్యకు చాలా దుఃఖం కలిగింది. తండ్రిని మెల్లగా ఓ రిక్షాలో కూర్చోబెట్టి ఇండస్ట్రియల్ ఏరియానుండి అడ్డ దోవనపడి బరకత్‌పురా వచ్చాడు. డాక్టరు రాజు వద్దకు తీసుకుపోయాడు.

శ్యాం ఎర్ర నీళ్ళూ పచ్చ నీళ్ళూ ఊదా నీళ్ళూ సీసాల్లో బోసి వచ్చిన రోగులకు ఇస్తున్నాడు—ఆలా కొందరికి వారాలూ కొందరికి నెలలూ మరికొందరికి సంవత్సరాలూ ఇస్తూ వుంటాడు. రోజూ ప్రతి పేషెంటూ యాభై పైసలు ఇచ్చి పోతూ వుండాలి-అదే ఫీజు యాభై పైసలు తేలికగా ఇచ్చుకోగలరు కదా గరీబువాళ్ళు-ఒకేసారి వందా రెండు వందలూ ఫీజంటే వణుకుతారు కాని—

పోచయ్య ఏడుస్తూ తండ్రిని రిక్షా దింపాడు.

రిక్షావాడు సాయం పట్టాడు.

కిరాయి ఇవ్వబోయాడు పోచయ్య.

రిక్షావాడు తీసుకోలేదు—

' ఫికరులేదు పో—ముందు మీ అయ్యకు మందు తీసుకొనిరా—మళ్ళీ మీ ఇంటికాడ వదిలిపెట్టి వెళ్తాను ' అన్నాడు రిక్షావాలా—

' రక్షించండి బాబో రక్షించండి ' ఏడుస్తూ పోచయ్య లోనికి ప్రవేశించాడు.

శ్యాం విసుక్కొన్నాడు 'ఎవడ్రా వాడు అరుస్తున్నాడు.'

' బాబో-మా నాయన గుడ్లు తేలేసిండు- '

' నోరు మూసుకొని వరుసలో నిలబడు- ' బంట్రోతు పోచయ్యను క్యూలో నిలబెట్టబోయాడు.

పోచయ్య బంట్రోతును ఒక్క విదిలింపు విదిలించుకున్నాడు—నేరుగా శ్యాం దగ్గరికి నడిచాడు. (సశేషం)

# జ్యోతిషవాణి

నిర్వహణ : దైవజ్ఞరత్న వాస్తుజ్యోతిష విద్వాన్
**కవితా కామేశ్వర శర్మ**
అవనిగడ్డ - 521 121

సిహెచ్. నాగశేఖర్ — నందిగామ
సమా : డిగ్రీ 1988 లో పూర్తి లేదా 89. భవిష్యత్ ఆశాజనకం. ఉద్యోగం వస్తుంది.

సిహెచ్. శ్రీనివాసరావు (S/o గోవిందస్వామిగారు) — నందిగామ
సమా : మీ వివాహం 1988. 1987 లో పల్నాటి శని పోతుంది. లాటరీ ద్వారా డబ్బు రాదు. ఆశపడకండి. వ్యాపారం చేసుకోండి. బాగుంటుంది. సంపాదిస్తారు.

చింతలపూడి శ్రీనివాసరావు — నందిగామ
సమా : మరేమీ భయంలేదు. మీ భవిష్యత్ మున్ముందు బాగుంటుంది. సమస్యలు ఏవో ప్రతివారికి ఉంటవి. 1987 నుంచి అభివృద్ధి వుండును. లక్ష్మీస్తోత్రం రోజూ చదవండి.

వి. యల్. యన్. శర్మ — నందిగామ
సమా : ఉద్యోగం 1987 లో వస్తుంది హనుమాన్ చాలీసా చేస్తూ వుండండి, జాతకం లేదా ? జనన వివరాలు పెద్దలు వ్రాయలేదా ? మీరు సంపాదించలేదా.

దేవత వెంకట మహలక్ష్మి — నందిగామ
సమా : మీరు ఉద్యోగం చేస్తారు. మీ నక్షత్రంకి 1987 మార్చి వరకు దోషంలేదు. ఆపైన అష్టమ శని Bad వివాహం వెంటనే కలసిరాదు. 1988 కావచ్చును. స్నేహితులలో అటు యిటు వుంటారు.

వై. సుధాకర రెడ్డి — నందిగామ
సమా : బి. ఏ. ఎంట్రన్సు చదవండి. అనుకూలత వ్యాపారం చేస్తారు. లాభిస్తుంది. ఎంట్రన్సు ప్యాసవుతారు.

---

జ్యోతిషవాణి

పేరు ........................................................

పూర్తి చిరునామా...............................................

.....................................................

లేఖ వ్రాయు తేదీ........................

టైము పగలు/రాత్రి........................

జనన తేదీ............లేనిచో సుమారు వయస్సు

---

యేచూరి శ్రీనివాస్ — నందిగామ
సమా : మీరు వ్యాపారం చేస్తారు. ఇంటర్‌లో ఒకటి పోవచ్చును. ప్రస్తుతం సామాన్యం.

యేచూరి రామకృష్ణ — నందిగామ
సమా : వ్యాపారంలో పైకి వసారు. ప్రస్తుతం మంచి రోజులు. భవిష్యత్ బాగానే వుంటుంది.

మద్దూరి శివప్రసాద్ — కైకలూరు
సమా : బి కాం ప్యాసవుతారు. ఉద్యోగం చేస్తారు.

సత్యప్రసాద్ — మధిర
సమా : రచయితగా శోభిస్తారు. మీ నవల వెలుగులోకి వస్తుంది. నవల పేరేమిటో వ్రాయలేదే.

యస్. సురేఖ — జుజ్జూరు
సమా : రాహుదశ వస్తేనేగాని వివాహం కాదు అనగా 1988 వచ్చిన తరువాత ఒకప్పుడు 1989. ఉద్యోగి భర్త. పశ్చిమ ఉత్తర దిశలలోని సంబంధం ( 2 ప్రశ్నలే అడగాలి )

జొన్నలగడ్డ హైమ నాగవాణి — నిప్పట్లపాడు
సమా : లోగా పర్సనల్‌గా జాబు వ్రాశాను గదా. జాతకమంటే జనన తేది టైము పంపుట కాదు. చక్రములు వగైరా వుండాలి. అయినా మీ భవిష్యత్తు ఫరవాలేదు. ఆశాజనకముగ నుండును.



# గీత ( మినీ కథ ) — గాధిరాజు మధుసూధనరాజు

చారడేసి కళ్ళతో, నునుపైన చెక్కిళ్ళతో, ఎర్రని పెదాలతో, మెరుపుతీగవంటి పల్వరుసతో, గుండ్రంగా ముద్దుగా యున్న ముఖముతో, దట్టంగా బారెడు పొడవున్న జడతో, కమనీయమైన శరీర సౌష్టవముతో, కనువిందు చేసేస్తూ ఓ కన్నెపిల్ల మా కాలేజీలో చేరింది.

అప్పటికి నేను బియస్సీ ఫైనలియర్ చదువుతున్నాను.

ఇక నేను, నా మిత్రుడు ప్రభుదాస్ ఇద్దరం కలిసి ఇన్వెస్టిగేషన్ మొదలుపెట్టి, అతి కష్టం మీద ఆమె పేరు కనుగొన్నాము– 'గీత'ట. అంతకుముందు 'బి. సి. కాలేజీలో రాజమండ్రిలో చదివింది'ట.

తటుక్కున ఓ ఆలోచన మెదడులో మెరిసింది గబ గబా శాస్త్రి వద్దకి పరుగెత్తాము. అతను కూడా మా క్లాసుమేట్.

కాకపోతే వాడుకూడా బి. సి. కాలేజీలోనే రాజమండ్రిలోనే మొన్నటిదాకా చదివి వచ్చాడు. వాళ్ళనాన్నకి రాజమండ్రి నుండి కర్నూలుకి ఈ మధ్యనే ట్రాన్సుఫర్ అయింది. కాబట్టి మా కాలేజీలో చేరవలసివచ్చింది.

అందుకే వాడిని పట్టుకుంటే గీతని గురించి అన్ని వివరాలు తెలుసుకో వచ్చునని ఆశ.

"హలో.... శాస్త్రీ హౌ ఆర్ యూ!" గట్టిగా విష్ చేశాను. కాని వాడు పలకలేదు.

"ఏ పురాణమో రామాయణమో చదువుతుంటూ వుంటాడు గట్టిగా పిలు" అన్నాడు ప్రభు చిరాగ్గా.

"హలో...."

ఫైరింజన్ వాళ్ళకి ఫోన్ చేస్తున్నట్లుగా భయంకరంగా అరిచాడు ప్రభు.

"హలో.... హలో....

ఏంటి ఇలా వచ్చారు! రండి రండి"

అన్నాడు శాస్త్రి కాస్త అయిష్టంగానే.

"ఒరేయ్ శాస్త్రీ! నీకు గీత గురించి తెలుసా?"

ప్రశ్నించాడు ప్రభు ఆత్రంగా.

'గీత' అనంగానే శాస్త్రి ముఖం చేటంతయింది.

"ఓ.... నాకు తెలియక పోవటమేంటి? చాలా బాగా తెలుసు" అన్నాడు శాస్త్రి.

"మరి మొదటిసారిగా "గీత" ను ఎక్కడ చూశావ్? గుడిలోనా? బజారులోనా?"

ఆత్రంగా ప్రశ్నించాడు ప్రభు.

"లైబ్రరీలో...." అన్నాడు శాస్త్రి

"ఆ తరువాత ...? ...." అన్నాడు ప్రభుఆత్రంగా.

"మొదట్లో గీతను చూస్తూనే ఏదో ఆకర్షణకి లోనై పోయాను. తరువాత గీతకి చేరువకాకుండా ఉండలేక పోయాను.

మొదట గీతను అర్థం చేసుకోవటం కాస్త కష్టమే అనిపించింది. కాని.... పదిరోజుల లోపుగానే చక్కగా అర్థం చేసుకో గలిగాను. ఏదైనా బాధలతో మనసు బాగా లేనప్పుడు, గీతతో కాసేపు కాలక్షేపం చేస్తే మనస్సుకి హాయి కలిగేది. ఎనలేనిధైర్యం వచ్చేది.

ఆ తరువాత నేనెప్పుడైనా లైబ్రరీకి వెళ్ళినా అది గీత కోసమే.

గీతను అభిమానించాను. ఆరాధించాను.

మాలెక్చరర్లు కూడా గీత అంటే చాలా యిష్టపడేవారు. లీజర్ అవర్సులో గీతతోనే కాలక్షేపం చేసేవారు.

ఆ విధంగా గీత నాకు దూరం అవుతూ వచ్చింది.

కొన్ని రోజుల తరువాత- అసలు లైబ్రరీలో గీత కనిపించేది కాదు.

మళ్ళీ ఓసారి ఓ బుక్‌షాప్ వద్ద కనిపించింది. కాని కాస్త తొందర పని ఉండటం వలన నిలబడకుండా వెళ్ళి పోయాను.

ఆ తరువాత పరీక్షల గొడవల్లోపడి గీతను గురించి మరిచిపోయాను.

ఇంత కాలానికి మీరు మరలా గుర్తుకు తెచ్చారు.

ఏరా ? గీత మీకేమైనా కనిపించిందా ?

చెప్పండిరా ? గీత ఎక్కడుంది ? ”

ఆత్రంగా ప్రశ్నించాడు శాస్త్రి తన ఉపన్యాసం ముగిస్తూ.

“ మన కాలేజీలోనే ” అన్నాడు ప్రభు.

“ మన లైబ్రరీలోనా ? ” ఆశ్చర్యంగా ప్రశ్నించాడు

“ అమ్మాయిలు లైబ్రరీల్లో తప్పితే ఇంకెక్కడా కని పించరనేనా నీ ఉద్దేశ్యం ! నీ వెక్కడి వెర్రి వెంగళప్పవి తోదయ్యావురా బాబూ ” అంటూ-

“ ఆ అమ్మాయి ప్రస్తుతం మన క్లాసులోనే చేరింది ” అన్నాడు ప్రభు చిటికేస్తూ.

“ మీరు అనేదేమిటో నాకు అర్థం కావటం లేదు ” అన్నాడు శాస్త్రి నిట్టూరుస్తూ.

“ అదేరా నీ ‘ రాజమండ్రి గాళ్ ఫ్రెండ్ గీత ’ మన క్లాసులోనే జాయిన్ అయింది ” అన్నాడు ప్రభు ఏదో అరటిపండు ఒలిచి నోట్లో పెడుతున్నట్లుగా.

“ ఓరి దౌర్భాగ్యుడా ! ప్రభుదాసూ ! నేను ఇంత వరకు చెప్పినది గీతను గురించి అంటే పవిత్రమైన భగ వద్గీతను గురించి. మీరు అనుకున్నట్లు ఏ అమ్మాయిని గురించీ కాదు. ఆవకాయని గురించీ కాదు. ఇక గీతార్థ సారాన్ని గురించి కాస్త వివరిస్తా నుండండి....” అంటూ గళం విప్పాడు శాస్త్రి.

ఇక తల బాదుకోవటం మావంతు అయింది. ★

## బాలవాణి

సోమంచిరామం

### నీ దేశ చరితం

తెలుసుకో నీ దేశ చరితం
నిలుపుకో నీ జాతి గౌరవం ... ॥తె॥
ఉత్తరాన పెట్టని కోట గోడలై
ఎత్తుగ నిలచెను హిమాలయా లవిగో...॥తె॥
సుందర తరము, సుందర తమము
నందన వనము కాశ్మీరమ్మదిగో ... ॥తె॥
దేశ దేశాల జనుల మోజు తీర్చే
షాజహాను నిర్మిత తాజ్‌మహలదిగో... ॥తె॥
బంగారు పంటలై పొంగులెత్తే
గంగా యమున గోదావరు లవిగో... ॥తె॥
పుణ్య తీర్థములు పుణ్యక్షేత్రములు
మధురమీనాక్షి కంచి కామాక్షులవిగో...॥తె॥
శాంతి నికేతన స్థాపకుడు
విశ్వ కవీంద్రుడు రవీంద్రుడడిగో...॥తె॥
శృంగార పదముల సృజియించి
సృష్టికే పుష్టినిచ్చిన క్షేత్రయ్యడిగో...॥తె॥
సర్వమత సారమొక్కటే యని
చాటి చెప్పిన నరేంద్రు డడిగో ... ॥తె॥
సత్యా హింసలతో సాధించిన
స్వాతంత్ర్య ప్రదాత గాంధితాతడిగో... ॥తె॥
పంచశీలనే ప్రవచించిన
పండిత జవహర్‌లాలడిగో ... ॥తె॥
త్రిలింగ దేశము నెగిరే
త్రివర్ణ పతాక మదిగో ... ॥తె॥

ఆశ్రమవాసపర్వం - 6

# కుంతి ప్రయాణం

ధృతరాష్ట్రుడెట్టివాడైనా ఆతడు విదురుణ్ణి సంజయుణ్ణి విడిచి వుండలేడు. వీరిద్దరూ లేకపోతే ధృతరాష్ట్రునికి లోకం బొత్తిగా చీకటి అయి వుండేది. ఆతనికి లోకం అంతా సంజయుని చూపుతోనే కనబడేది. భారత యుద్ధాన్ని సంజయుని కండ్లతోనే ధృతరాష్ట్రుడు చూసాడు. ఈతడు అనల్పమైన లౌకిక నీతి నెరిగి వుండి, ధర్మం పట్ల పక్షపాతమున్నవాడు. లోకాన్ని తెలియ చేస్తూనే, ధృతరాష్ట్రునిలో నైతిక విలువలను మేల్కొల్పా లన్న ప్రయత్నం సంజయునిది. ఇక విదురుడు ధృతరాష్ట్రునిలో కొరకితంగా వున్న జ్ఞాన నేత్రాన్ని ఉన్మీలింపచేయడానికి మీదు కట్టుకొని వున్నవాడు.

వడలి మందేశ్వరరావు

ఈ వృద్ధరాజు విదురుణ్ణి ఒకసారి పాండవులను వంది పొగడుతూన్నట్లు పొగడుతున్నాడన్న కోపంతో, వాళ్ళ దగ్గరకే అరణ్యానికి పొమ్మన్నాడు. కాని అతడు వెళ్ళాక ధృతరాష్ట్రునికి క్షణం తోచలేదు. మళ్ళీ విదురుణ్ణి పిలిపించుకొనేవరకూ ఆతనికి కునుకు పట్టలేదు. లౌకిక, పారమార్థిక, జ్ఞాన నేత్రాలయిన ఈ ఇర్వురినీ విడిచి వుండలేడు కనుక వారిద్దరూ ధృతరాష్ట్రుని అనుసరించి వనవాసానికి ప్రయాణమవడం న్యాయమే !

మరి కుంతి ?

ధర్మరాజు కుంతితో, "మా అయ్య వనవాసానికి వెడుతున్నాడు. నే నతనితోనే వుండి, శుశ్రూష చేస్తూ వుంటాను. ఈ స్త్రీలనందరినీ తీసికొని నీవు వెనుకకు వెళ్ళు" అన్నాడు.

కుంతి : "ఏమిటి నువ్వు అడవికి వెళ్ళడమా ? ఈ మహారాజు అనుమతిస్తాడనే అనుకుంటున్నావా ? ఈమెను నా అత్తగాను, ఈ రాజును నా మామగాను తలుస్తూ, వీరిని కొలిచి వుంటాను. వీరికి శుశ్రూష చేయడానికి సమర్థను నేను. మీ కది శక్యం కాదు. వీరు అడవిలో వుంటే, నేను ఇక్కడ ఇంట్లో వుండగలనా ? ఇదే నా వ్రతం."

అని, తన భుజంమీద వున్న గాంధారి చేతిని మెల్లగా తీసి, ధర్మరాజుతో, "ఇంక మీరేమీ మాట్లాడవద్దు. చిన్న తమ్ముడు సహదేవుని కనిపెట్టుకొని చూస్తూండు. కర్ణుని మరచిపోవద్దు ఆతని పుట్టువును అణచిన పాపాత్మురాలను నేను. దాని కెప్పుడూ నేను వగస్తూనే వుంటాను. నీవు, తమ్ములు భక్తితో ఆతణ్ణి తలుస్తూ వుండండి. ద్రౌపదిని గౌరవంతో మన్నించండి. రాజ్యాన్ని పాలించేటప్పుడు, తమ్ముల కోర్కెలను కూడా ఒక కంట కనిపెడుతూ వుండి, వాటిని మన్నించు. ఇక నా నిశ్చయానికి తిరుగులేదు. వెనుకకు మరలండి !" అన్నది.

ఈ మాటలు విన్న ధర్మరాజు విషాదాన్ని పొందాడు. భీమాదులు బెంగపడి కన్నీళ్ళు కారుస్తూ తలలు వంచుకున్నారు. వాళ్ళందరి నడకా కుంటువడింది. ధృతరాష్ట్రుడు రెండడుగులు ముందుగా వుండగా, ధర్మరాజు తల్లిని చూసి మరొక్కమాట అన్నాడు. "అమ్మా ! ఇట్టి పనిని తలపెట్టావేమిటి ? నిన్ను నే నడవికి పంపిస్తానా ? వెనుకటిలాగే చేదోడు వాదోడుగా వుంటేనే కదా, ఈ సామ్రాజ్యాన్ని నేను భరించగల్గేది ? నీవూ, కృష్ణుడూ మమ్మల్ని ఎలా నడిపించావో మరచిపోయావా ? నీ కొడుకులూ, కోడలూ, ఇలా ఈ శోకంతో విలవిలలాడి పోతూంటే, నీవు అడవిలో వుంటావా ?"

అలా అన్నా, కంటినిండా కన్నీరే అయినా, ఆమె అడుగు ముందుకే సాగింది కాని, వెనుతిరిగి చూడలేదు.

అలా కాదని, ఆమెతో భీముడిలా అన్నాడు. "ఇలా ధర్మరాజును వదలి వెళ్ళడానికి కూడా ఏదో కారణ

ముండాలి కదా ! నీ ఆజ్ఞను, కోర్కెను మన్నించే కదా, ఈయన యుద్ధంచేసి, రాజులందరినీ నిశ్శేషంగా చంపి రాజయాడు ! ఈ రాజ్యలక్ష్మిని భరించి, ఇప్పుడే కదా కాస్త స్థిరపడుతుండగా, ఈయన్ను వదలి వెళ్ళడం న్యాయమేనా ? అమ్మా, నీ కిష్టమైన దానాలను చేస్తూ, ధర్మాలను ఆచరిస్తూ, మా కళ్ళ ఎదుట వుండు. అదే మాకు పదివేలు ! ”

ద్రౌపదికీ, సుభద్రకూ కూడా శోకం ఆగక వెక్కి వెక్కి ఏడ్చారు. పాండవులకూ శోకం ఆగలేదు. పరిజనానికి కన్నీళ్ళు ఆగలేదు.

“ ఏమిటి వీళ్ళ అవివేకం ! ” అనుకుంది కుంతి. చీవాట్లు పెట్టకపోతే వెనుకకు మరలరు అనుకున్నది. కన్నీరు తుడుచుకుంది. ఒక్కసారి చుట్టూ అందరినీ కలయచూసింది. కొడుకులు, కోడళ్ళు వింటూండగా, వాళ్ళ పరిజనంతో ఇలా అంది :

“ ఆనాడు మాయా జూదంలో వీళ్ళెంతగా చులకనై పోయారు ! ఆ సభలో ఎంతటి అపకీర్తికి లోనయారు ! ఆమీద అడవుల్లో పడిన కష్టా లెన్నని ! వీట్లన్నింటినీ నేను సహించలేకపోయాను. సంధి మాటలన్నీ పెడదారి పడుతున్నాయని, నలుగురూ నవ్వుతూండగా తలలు వంచుకొని, కౌరవులతో అంతగా చెడి బ్రతికేదేమని, శ్రీకృష్ణునితో ఆనాడలా అన్నమాట నిజమే ! ”

ఆనాడామె భీమార్జునులతో చెప్పమని శ్రీకృష్ణునితో అన్నమాట లివి :

“ కొడుకుఁ గాంచు రాచ కూఁతు రెద్దానికి
నట్టి పనికి నుచితమైన సమయ

నట్లు గాని పురుషు లనరు మిమ్ము ”

: 3 - 199

ఈ మాటలనే ఇప్పుడు పాండవులకు జ్ఞాపకం వచ్చేటట్టు చేసి, ధర్మరాజుకు పాంచాలిని చూపి, ఆమె ఇంకా ఇలా అన్నది :

## మోక్షం

మోక్షము అంటే ఏమిటి ? విడుదల
దేనినుండి విడుదల ? బంధముల నుండి
ఏది తనను బంధించి బాధిస్తున్నదో
దానినుండి విడుదల
ఏది బంధిస్తున్నది ?
తను ఆత్మస్వరూపుడై యుండి, ఆ
అనుభవము లేని అజ్ఞానముచేత
బాధింపబడుచున్నాడు.
అజ్ఞానమంటే ఏమిటి ?
తన వాస్తవస్థితి తనకు తెలియకపోవడం.
జ్ఞానమంటే ఏమిటి ?
తాను ఆత్మస్వరూపుడై యున్నాను
అనే అనుభవము.

— మెహెర్ బాబా

“ సుకుమారి ఈ పాంచాలిని తల పట్టి, ఈడ్చి, సభలో, దుశ్శాసను డవమానిస్తుండగా, పెద్ద లందరూ చూస్తూ ఊరకుండగా, ఆ కష్టాల్ని మీరు ఓర్వ వలసి వచ్చింది. నీ తేజమంతా ఆనాడు నీఱయి పోయింది. అందుకే మీ అభ్యుదయాన్ని కోరి, ఆనాడు కృష్ణునితో అలా అనవలసి వచ్చింది. ఆ మాట నిప్పుడు భీముడు త్రవ్వుతున్నాడు. ”

ఈ మాటలకు ధర్మరాజు, భీముడు సిగ్గు పడ్డారు. భీముడు ఏమి నొచ్చుకుంటాడో అని, మళ్ళీ ధర్మరాజుతో కుంతి ఇలా అంది : “ నే నిలా అన్నానని నొచ్చుకో వద్దు నీ మనసు అంతా నిర్మలంగా ఉంది. నీ భాగ్యాతిశయం వల్ల నే ననేక ఉత్తమ దాన ధర్మాలను చేయ గల్గాను. లోకులు నుతించే టట్టుగా నీవు చేసిన

యాగాన్ని కన్నులారా చూశాను. నాకు ఇంక లోటనేది ఏముంది? తపస్సుకు ఫలమైన ఉత్తమ గతినే నేనిక కోరుకో దగినది. దానికి వీరి వంటి తోడు మళ్లా నాకు దొరుకుతుందా? ఈ రాజుకూ దేవికీ పరిచర్య చేస్తూ, తపస్సు వల్ల శరీరం కృశించేటట్టుగా మిక్కిలి నియమంతో శేష జీవితాన్ని గడుపుతాను. ఇక మీరు వెనుకకు మరలండి!"

పాండురాజు మహిషి తమతో అడవికి రావడానికి ఇలా సిద్ధపడడం, పాండవులు దాని కంగీకరించక ఆమెను వెనుకకు రమ్మని ప్రార్థించడం, ధృతరాష్ట్రుడు గ్రహించాడు. విజయ సంజయులను పిలిచి, ధర్మరాజు ఎలా చెపితే అలా చేయమని కుంతికి చెప్పమన్నాడు. వారలా చెప్పినా, అమె నిశ్చయం మారలేదు.

కుంతి దృఢ నిశ్చయంతో కొడుకులను కోడండ్రను, మిగతా బంధుజనాన్ని, పరిజనాన్ని ఒక్కసారి తల యెత్తి చూసింది. "ఇలా ఎందుకు వసారు? ఆగండి!" అని, మళ్ళీ అనునయిస్తూ "సుఖులై ఉండండి!" అన్నది.

ఇక ఆమె అరణ్యానికి ఎలానూ వెడుతుందని నిశ్చయించుకొని, బంధువులు పరిజనం ఆమెకు మ్రొక్కి, ఏడ్పులతో వెనుకకు మరలారు.

పాండవు లామెను ముందు వెళ్లే ధృతరాష్ట్ర గాంధారులతో కలిపారు. వారిద్దరితో "మీరు వనానికి వెడుతూంటే, తానుకూడా లేకపోతే మాకింక కాలం ..? గడుస్తుందని బెంగపడి, ఆమెను ఎన్ని విధాల ప్రార్థించినా ఆమె ఇక్కడ నిలవడానికి అంగీకరించ లేదు ఈ సాధ్వికి బుద్ధి చెప్పి కొనుచుం బరిచర్య సేయించుకొం" డని యప్పగించి, యా రాజునకు నర్దేవికిం గుంతికిం బ్రదక్షిణంబు సేసి, దండ ప్రణామంబు లాచరించిన, దీవించి, వా రామంత్రణంబు సేయ నా ధర్మపుత్రాదు లశ్రుప్లావితంబులగు వదనంబుల తోడ మరలిరి.

( సశేషం )

# మానవ శరీరం

**మానవ** శరీరం అనే యంత్రంలో ఉన్నంత విశిష్టమైన సాంకేతిక నైపుణ్యం ఏ అధునాతన యంత్రంలో లేదేమో! శరీరంలో 206 ఎముకలు, 750 కండరాలు ఉన్నాయి. 140 పౌనులు బరువు ఉండే మనిషి శరీరంలో 40,694 గ్రాముల నీరు, 11,357 గ్రాముల కార్బన్, 1,694 గ్రాముల హైడ్రోజన్, 1,626 గ్రాముల నైట్రోజన్, 3,682 గ్రాముల ఆక్సిజన్, 2,716 గ్రాముల ఖనిజ లవణాలు ఉంటాయి.

140 పౌనుల బరువుగల మనిషి శరీరంలో వుండే కొవ్వు పదార్థంతో మనం స్నానానికి ఉపయోగించే 7 సబ్బు బిళ్ళలు చెయ్యవచ్చు. మన శరీరంలో వుండే ఇనుముతో ముప్పావు అంగుళిక పరిమాణముగల రెండు గట్టి మేకులు తయారు చేసుకోవచ్చు. చక్కెరతో మూడు కప్పుల కాఫీ తయారవుతుంది. కార్బన్‌ని గ్రాఫైట్‌గా మార్చితే పిల్లలు వ్రాసుకొనే తొమ్మిదివేల పెన్సిళ్లు తయారు చేయవచ్చు. ఫాస్ఫరస్‌తో 2,200 అగ్గిపుల్లలు చేసుకోవచ్చు. కాల్షియంతో ఒక ఇంటికి సున్నం వేయవచ్చు. శరీరంలో ఉత్పత్తి అయ్యే హైడ్రోజన్, ఆక్సిజన్ వాయువులతో 500 గ. పొడవైన రోడ్డుకు 2 గంటల సేపు వీధి దీపాలు వెలిగించవచ్చు.

మనం బ్రతికి ఉండగా ఎన్నెన్నో ఘనకార్యాలు సాధిస్తుంటాం. కాని చనిపోయాక ఆ శరీరం ఎందుకూ పనికిరాకుండా పోతుంది. ఇంత శక్తివంతమైన శరీరాన్ని సృష్టిస్తున్న ఆ భగవంతుడు సర్వశక్తివంతుడు కాదా? అటువంటి సర్వేశ్వరుని గుర్తించడానికి శక్తి చాలక దేవుడే లేడని వితండవాదనకు దిగుతున్నారు కొందరు ప్రబుద్ధులు.

***

# అభిప్రాయవేదిక

" శ్రీవాణి నెల నెలకూ నూతన తేజస్సును సంతరించు కుంటూ 'సుపథం'లో సజ్జనులకు సన్మార్గం చూపిస్తూ పురోగమిస్తున్నది. "

– డా. ఇలపావులూరి పాండురంగారావు, న్యూఢిల్లీ

" ధార్మిక, ఆధ్యాత్మిక, సాహిత్య, సాంస్కృతిక విషయాలను పొందుపరచి పత్రికను ప్రయోజనకరంగా తీర్చిదిద్దుతున్న తీరు ప్రశంసనీయము. వ్యాపార సంస్కృతికి అంకితమైపోయిన ఈనాటి పత్రికారంగంలో.. 'శ్రీవాణి' వంటి పత్రికను నడపడం మీవంటి దీక్షాపరులకే సాధ్యమవుతుంది. "

– సి. వేదవతి, హైద్రాబాద్

" ఉపయోగకరమైన అనేక శీర్షికలతో, సకాలంలో ప్రతినెలా వెలువడి, ఎదురు చూడకుండానే పాఠకుల చేతి కందుతోంది. ముఖచిత్రం విషయంలో మరే పత్రికకు లేని విలక్షణత, ప్రత్యేకత ' శ్రీవాణి ' కి వుంది. "

– జి. రాజేంద్ర, కామారెడ్డి

" నిజంగా ' శ్రీవాణి ' శ్రీవాణియే. ఆంధ్రదేశంలో వుండే ఆంధ్రులకే కాక ప్రవాసాంధ్రులకు కూడా ఈ పత్రిక వేదాంత, సాహితీ విజ్ఞానములను పంచిపెడుతోంది అనడంలో రవ్వంతయైన అతిశయోక్తిలేదు. మా తెలుగు శాఖలోని అధ్యాపకులు, విద్యార్థులు, పరిశోధకులు మీ పత్రిక ప్రతినెలా ఎప్పుడు విడుదల అవుతుందా ! అనే ఆత్రతతో ఎదురు చూస్తున్నారు. "

– డా. భమిడిపాటి విశ్వనాథ్
కాశీ హిందూ విశ్వవిద్యాలయం, వారణాశి

" Kindly find enclosed a cheque of Rs. 500/- towards Life membership. I feel happy to go through the articles published in " SREE VANI ".

—G. S. RAJU, Siris, Vijayawada

" ఒక్కసారి చదవగానే ప్రతినెలా చదవాలనే ఉబలాటం కలిగించే పత్రిక "శ్రీవాణి". విజ్ఞాన సాహిత్య విషయాలలో ఎంతో ముందంజ వేస్తున్నదని చెప్పడానికి సందేహంలేదు. "

– డా. టి. రామమూర్తి, వరంగల్

'శ్రీవాణి'ని చదివి మా ఇంటిల్లిపాది ఆనందించు చున్నాము. జీవిత చందా నిమిత్తం రు. 500/- Draft పంపుతున్నాను. శ్రీ వాణి అభివృద్ధిలోనికి రావాలని ఆకాంక్షిస్తున్నాము.

– జె. యన్. నరశింహం కుజు (బీహార్)

"శ్రీవాణి నానాటికి క్రొత్తందాలు సంతరించుకొంటుంది. సాయి ప్రేమ పుష్పాలు శ్రీవాణికి – మణిహారాలు. తెలుగుల వెలుగు తోరణాలు ! "

– పి. మోహన్, విజయనగరం

కె. ఆర్. కె. మోహన్‌గారి "ఉదాత్తతే బలహీనత" వ్యాసంలో ప్రతి హిందువు వివేకంతో ఆలోచించి దీక్షతో ఆచరించవలసిన విషయాలున్నాయి. వారికి అభినందనలు.

– ఎస్. ఎం. కనక్‌దండి, సునెబెడ–2 (ఒరిస్సా)

" మీ సాంస్కృతిక మాసపత్రికలో అమృతవాణి, హితవాణి, వైద్యవాణి, జ్యోతిషవాణి, మహిళావాణి— పలురకాల వాణులకు స్థానం కల్పించి చాలా ఆసక్తికరంగా సంపాదకత్వం నిర్వహిస్తున్నందుకు ధన్యవాదములు.

– జె. కె. మనోన్మని, తిరుపతి

## కృతజ్ఞతలు

ఆగస్టు శ్రీవాణి సంచికలో నేను వ్రాసిన "రిజర్వేషన్ల రగడ ఇంకెంతకాలం ? " " నా అనుభవం, అనుభూతి ప్రశాంతి నిలయంలో.... " అను వ్యాసాలను ప్రశంసిస్తూ అనేకమంది లేఖలు వ్రాసారు. వారందరికి నా కృతజ్ఞతలు.

– (సం.)